# TENSES IN ENGLISH

## ఆంగ్ల భాషలో కాలములు

T. రవికుమార్ B.Sc.





సరస్వతి పబ్లికేషన్

సత్యనారాయణ పురం, విజయవాడ - 11

# TENSES IN ENGLISH

by T. Ravikumar B.Sc.



FIRST EDITION :

*2002*

PAGE MAKERS :

*VISWA DIGITALS*
*Annapurna devi Street,*
*Gandhinagar, Vijayawada - 3*
*Ph. 400 023*

COVER DESIGN :

*N.V. Ramana*

PRINTED AT :

**KAMAKSHI WEB OFFSET**
**VIJAYAYAWADA - 2**

PUBLISHED BY :

SARASWATI PUBLICATION
*Satyanarana puram,*
*Vijayawada- 11*

*Price: Rs.* 20/-



ఈ పుస్తకమును సాధ్యమైనంత తప్పులు లేకుండా ముద్రించినాము. ఎక్కడైనా తప్పులు ఉంటే మాకు తెలియపరిస్తే మలి ముద్రణలో సవరించుకోగలము.

# USAGE OF TENSES IN ENGLISH

# కాలములు - ఉపయోగించే పద్ధతి

## ఉపోద్ఘాతము

భావ వ్యక్తీకరణకు ఉపకరించే భాష. అసంఖ్యాకమైన పదాల గుంపును భాష అనవచ్చు. ఈభాష మళ్ళీ రెండు రకాలు

1. మాట్లాడే భాష
2. వ్రాసే భాష

మాట్లాడుతున్నప్పుడు మాట్లాడే వ్యక్తి యొక్క మాటలతో బాటు అతని హావభావాలూ ముఖకవళికలూ చెప్పదలచుకున్న విషయాన్ని కొంత వ్యక్తపరుస్తాయి.

వ్రాసే భాష విషయంలో ఆ నిర్లక్ష్యం పనికిరాదు. ఇక్కడ పద్ధతి అవసరం. ఆ పదరే వ్యాకరణం అంటారు. ఆంగ్లంలో దీనినే GRAMMAR అంటారు. ఈ గ్రామర్‌లో పదాలు అంటే ఏమిటి? వాక్యం ఎలా ఏర్పడుతుంది? ఒక వాక్య నిర్మాణానికి ఏవి వుండాలి? ఇలాంటి కొన్ని వందల, వేల సూత్రాలు వుంటాయి.

కర్త, కర్మ, క్రియ అనే మూడూ వరుసక్రమంలో కూడినప్పుడు వాక్య నిర్మాణం జరుగుతుంది. అని అందరికి తెలుసు. తెలిసిన విషయాన్నే అయినా మరోసారి నెమరవేసుకోవడం ఆ సందర్భంలో ఎంతో అవసరం.

SUBJECTకర్త - వాక్యములో పని చేసే వ్యక్తిని 'కర్త' అంటారు.

Verbక్రియ - వాక్యములో కర్త చేత చేయబడుతున్న పనిని 'క్రియ' అంటారు.

OBJECT కర్మ - వాక్యములో కర్త చేయబడిన పని వలన వచ్చు ఫలితం 'కర్మ' అంటారు.

ఇప్పుడు ఒక ఉదాహరణ చూద్దాం

| SUBJECT | VERB | OBJECT |
|---|---|---|
| Cat | Killed | Rat |
| కర్త | కర్మ | క్రియ |
| పిల్లి | ఎలుకను | చంపెను |

పై ఉదాహరణలో ఎలుకను చంపుట అనే పనిని పిల్లి చేసింది కనుక పిల్లి కర్త (subject) చంపుట అనేది క్రియ చంపబడిది ఎలుక అంటే కర్మ (Object)

పై ఉదాహరణలో ప్రధానమైన తేడాను గమనించారా?

తెలుగు వాక్యంలో కర్త - కర్మ - క్రియ వరుసగా వచ్చాయి. అదే వాక్యం ఇంగ్లీషులో తర్జుమా అయేసరికి వరుస మారిపోయి - కర్త - క్రియ- కర్మ వరుసగా వచ్చాయి.

ఇంగ్లీషు భాషకూ, భారతీయ భాషలకూ గల ప్రధానమైన తేడా యిదే. మనకు కర్త, కర్మ, క్రియ వరుసగా వస్తాయి. ఇంగ్లీషులో ఇది తారుమారు అయి కర్త కర్మలకు మధ్య క్రియ వస్తుంది. అంటే కర్త - క్రియ - కర్మ వరుస క్రమంలో వస్తాయి.

ఒక వాక్య నిర్మాణంలో కర్త - క్రియ- కర్మలకు ఎంతో ప్రాధాన్యత వుంది. వీటిలో మొదటి స్థానం కర్తది. ఇంగ్లీషులో 'Parts of Speech'.లోని Noun, pronoun అనబడే ఏ పదమైన ఒక వాక్యంలో కర్త స్థానంలో వాడవచ్చు. ఇక Noun - Pronoun - adverb - Adjective అనబడే పదాలు 'కర్మగా' వాడతారు. ఇక్కడ మనకు ఎలాంటి అడ్డంకి గాని యిబ్బంది గానీ లేదు ఆ పదాలను యధాతథంగా కర్తగానూ కర్మగానూ వాడవచ్చు.

ఇక క్రియ విషయానికి వద్దాం. Parts of speech లోని క్రియ(verb) అనబడే పదాలు అన్నీ ఇక్కడ వాక్యంలో వాడవచ్చు. అయితే క్రియ అంటే పని కదా ? ఆ పని కాలంతో ముడిపెట్టబడి వుంటుంది. అంటే పని ఎప్పుడు జరుగుతోంది? అనే విషయాన్ని బట్టి క్రియా (verb) రూపం మారిపోతూ వుంటుంది.

ప్రస్తుతం విపులంగా చర్చించబేయే విషయం యిదే!! కాలానికి అనుగుణంగా క్రియా రూపాలు ఎలా మారతాయి? కాలం ఎన్ని విధాలు? ఏ కాలానికి ఏ క్రియా రూపం ఉపయోగించాలి? అనే అంశాలను ఒక క్రమ పద్ధతిలో తెలుసుకుందాం. ముందుగా ఈ క్రింది పట్టికను గమనించండి.

| SUBJECT | VERB | OBJECT |
|---|---|---|
| Ravi | sings | asong |
| I | am Listening | an audio |
| Renu | has done | Slowly |
| She | has been watching | careful |

ఈ పై నాలుగు వాక్యాలను పరిశీలించండి. నాలుగు వాక్యాలలో వాడబడిన Ravi, I, Renu, She అనేవిNoun, Pronoun లు. a song, An audio, slowly, careful అనేవి వరుసగాNoun, pronoun, Adverb Adjective లు. వీటిలో ఎలాంటి మార్పులు లేవు.

ఇక క్రియలైన sing, listen, do, watch, అనేవి కాలానుగుణంగాlistening, has, done, has been watching అనే నాలుగు రూపాలుగా మారిపోయింది. ఈ క్రియ(Verb) ను నాలుగు రకాలుగా ఎలా రాయాలి. ఆ నాలుగు రకాల స్వరూప స్వభావాలు ఎమిటి ఇవి ఎలా తెలుస్తాయి అని అసక్తిగా వుంది కదూ!

అందుకే మనం ఇంగ్లీషు గ్రామర్‌లో కాలములు TENSES అనే అధ్యాయాన్ని సమగ్రంగా తెలుసుకుని వుండాలి. ఇక మనం ఈTENSES గురించిన పూర్తి వివరాలు తెలుసుకుందాం.

# అధ్యాయము - 2

## TENSES - కాలములు

వ్యాకరణములో కాలానికి ఎంతో ప్రాముఖ్యం వుంది. ఇంగ్లీషు గ్రామర్‌లో కూడా కాలము ఎంతో విలువైంది. కాలమును ఇంగ్లీషులో TENSE అంటారు. ఒక వాక్యంలో చెప్పబడిన విషయం ఏ కాలానికి చెందినదో తెలియాలి అంటే ఆ వాక్యంలో వాడబడిన క్రియారూపాన్ని పరిశీలించాలి. అప్పుడు అది ఏ కాలానికి ఎందినదో యిట్టే తెలిసిపోతుంది. ఈ వివరాలు అన్నీ ముందు ముందు నేర్చుకుందాం.

గ్రామర్‌లో TENSES మూడు రకములు

1. వర్తమాన కాలం : PRESENT TENSE (జరుగుతున్న కాలం)
2. భూత కాలం :PAST TENSE (జరిగిపోయిన కాలం)
3. భవిష్యత్ కాలం : FUTURE TENSE (జరగబోవు కాలం)

ఇలా సమస్తమైన పనులూ ఈ మూడు కాలాలలో ఏదో ఒక దానికి తప్పక చెంది వుంటాయి. ఇప్పుడు భూత, భవిష్యత్, వర్తమాన కాలాలను గురించి ఉదాహరణలతో వివరంగా తెలుసుకుందాం.

## 1.PRESENT TENSE (జరుగుతున్న కాలం)

జరుగుతున్న కాలాన్ని వర్తమానం లేదా Present tense (జరుగుతున్న కాలం) అంటారు. ప్రస్తుతం జరుగుతూ వున్న పనులను Present tense లో చెబుతాం

ఉదా : నేను చూశాను I See

నేను వ్రాస్తున్నాను. I am writing

## 2.PAST TENSE (జరిగిపోయిన కాలం)

జరిగిపోయిన, అయిపోయిన కాలాన్ని భూతకాలం అంటే Past tense అంటాం. జరిగిపోయిన పనులను చెప్పవలసి వచ్చినప్పుడు Past tense లో క్రియా రూపాలను రాస్తాడు.

## 3.FUTURE TENSE (జరగపోవు కాలం)

ముందు జరగపోయే కాలమును భవిష్యత్ కాలం అంటే Future tense అంటారు. జరుగపోయే పనులను చెప్పే సమయంలో Future tense లో క్రియా రూపాలను రాస్తారు

ఉదా : నేను వెడతాను I Shall go

పైన చెప్పబడిన ఉదాహరణలు చూశారు కదా! వెళ్ళడం (Go)అనే క్రియpresent Tense లోGo, Past Tense లోwent, Future tense లో Shall Go అని మూడు రకాలుగా రూపాంతరం చెందింది. అంటే యిప్పుడు మనం క్రియా రూపాన్ని బట్టి అది ఏ కాలమునకు చెందినదో చెప్పగలం కదూ!

నిజానికి కథ యింతటితో అయిపోతేదు. అసలు మొదలయింది యిప్పుడే ! తెలుగులో భూత, భూత, భవిష్యత్, వర్తమానం అనే మూడు కాలాలలో సర్వపనులూ జరిగిపోతాయి. కానీ ఇంగ్లీషులో అలా కుదరదు. ప్రతి కాలమునూ నాలుగు ఉప కాలములు(SUB TENSES) గా విభజించారు. అప్పుడుగాని ఇంగ్లీషులో వాక్యాలూ, క్రియారూపాలు సరిగా నిర్మాణం కావు.

ఆ సౌలభ్యం కోసం ప్రతి కాలము 4 ఉపకాలములుగా విభజింపబడింది.

1. SIMPLE TENSE (సామాన్య కాలం)

2. CONTINUOUS TENSE (జరుగుతున్న ఉపకాలం)

3. PERFECT TENSE (ఖచ్చితమైన కాలం)

4. PERFECT CONTINUOUS TENSE ఖచ్చితంగా జరుగుతున్న (ఉప కాలం)

స్థూలంగా ఈ నాలుగు Sub tenses ధర్మాలను గురించి తెలుసుకుందాం

1. SIMPLE TENSE : ఏ కాలమునకు సంబంధించినవైనా, సాధారణంగా జరిగే పనులను గురించి తెలుపుతుంది.

ఉదా : నేను కాఫీ త్రాగుతాను. I Drink Coffee.

2. CONTINUOUS TENSE : ఏ కాలంలో అయినా జరుగుతూ వున్న పనులను చేప్పేటపుడు దీనిని ఉపయెగిస్తారు.

ఉదా : నేను తాగుతూ ఉన్నాను. I am Drinking coffee

3. PERFECT TENSE : ఏ కాలంలో అయినా పూర్తి అయిన (ఖచ్చితంగా జరిగిపోయిన) పనులను చెప్పే సందర్భంలో దీనిని వాడతారు.

ఉదా : నేను కాఫీ తాగాను. I have Drink coffee

4. PERFECT CONTINUOUS TENSE : ఏ కాలమునకు చెందినా, ఎప్పటినుండీ ఆ పని జరుగుతున్నదో చెప్పేటప్పుడు దీనిని ఉపయోగిస్తారు.

ఉదా : నేను కొద్దిసేపటి నుండి కాఫీ త్రాగుతున్నాను. I have been drinking coffee from some time

ఇలా నాలుగు SUB TENSES లో క్రియారూపాలు ఏర్పడతాయి. ఒకసారి వెనుదిరిగి పరిశీలించండి. కాలం ప్రధానంగా మూడు భాగాలుగా ఏర్పడింది. భూత భవిష్యత్ వర్తమాన కాలములు. అంటే PRESENT TENSE, PAST TENSE, FUTURE TENSE

ఇది ఒక్కొక్కటీ మళ్ళీ నాలుగుSUB TENSES గా విభజింపబడ్డాయి. అంటే3 TENSES X 4 SUB TENSES అంటే మొత్తం 12 భాగాలుగా క్రియ రూపాంతరం చెందుతోంది చూశారా! ఒక్క పని అంటే క్రియ(VERB) 12 రకాలుగా మారిపోతుంది. విచిత్రంగా కొంచెం తికమకగా వుంది కదూ! మూడుTENSES లో నాలుగు SUB TENSES ఒకసారి గమనించండి, కొద్దికొద్దిగా మీసందేహాలు అన్నీ తీరతాయి.

**1. PRESENT TENSE**

**SUB TENSES**

1. A) SIMPLE PRESENT TENSE
2. B) PRESENT CONTINUOUS TENSE
3. C) PRESENT PERFECT TENSE
4. D) PRESENT PERFECT CONTINUOUS TENSE

**2. PAST TENSE**

**SUB TENSES**

5 A) SIMPLE PAST TENSE
6 B) PAST CONTINUOUS TENSE
7 C) PAST PERFECT TENSE
8 D) PAST PERFECT CONTINUOUS TENSE

**3. FUTURE TENSE**

**SUB TENSES**

9 A) SIMPLE FUTURE TENSE
10 B) FUTURE CONTINUOUS TENSE
11 C) FUTURE PERFECT TENSE
12 D) FUTURE PERFECDT CONTINUOUS TENSE.

ఇలా క్రియా రూపాలు 12 గా విభజింపబడ్డాయి. ఇప్పటి వరకూ మనం ఈ 12 క్రియా పేర్లను మాత్రమే తెలుసుకున్నాం. ఇప్పుడు ఈ క్రియా రూపాలను ఎలా (VERBS)ఉపయోగించాలో ఒకటొకటే ఉదాహరణలతో వివరణ చేద్దాం. అప్పుడు 12 రూపాలలో 3 కాలాలలో V ERBS ను ఎలా ప్రయోగించాలో మనకు క్షుణ్ణంగా తెలుస్తుంది.

# USING TENSES

## కాలములు - ఉపయోగించుట

## 1. SIMPLE PRESENT TENSE

జరుగుతున్న కాలంలోని సాధారణ పనులను గురించి తెలిపేందుకు ఈ Simple Present Tenseరూపంలో verbs ను వాడతారు.

అయితేPRESENT TENSE లోForm of Verb (క్రియా రూపం) ఎలా వుంటుందో ముందు చూద్దాం.

Form of verb (క్రియా రూపం) Present Tense లో Verb ఇదే Present Tense లో వుండాలి దీనికి ఎలాంటి ఉపక్రియ(Auxillary Verb) లను వాడకూడదు.

Present Tense లో verb కర్త మీద అంటేsubject మీద ఆధారపడి చిన్న చిన్న మార్పులకు గురి అవుతుంది ఎలాగు? అంటే కర్త 2 nd Person, 3 rd Person Plural (బహువచనం) కు చెంది వుంటే(VERB) లో ఎలాంటి మార్పు లేకుండా Present Tense లోనే వ్రాయాలి. కొన్ని సందర్భాల్లో కర్త (Subject)3rd person singular (ఏకవచనం)లో వుంటుంది. అప్పుడు(Verb) చిన్న మార్పునకు గురి అవుతుంది.

Verb చివర'S' లేదా'ES' అనే అక్షరాలు కలుస్తాయి. ఈ సందర్భంలో Verb కనుక Save అయితే అది Save గా మారిపోతుంది. అదే Verb కనుక Watch అయితే అది Watches గా మారుతుంది.

కర్త I person, II persons, III Person అనే మూడు రూపాలలో వుంటుంది. అలాగే ఏకవచన, బహువచన (singular & Plural) రూపాల్లో వుంటుంది. ఈ క్రింది Table లో ఉదాహరణలు గమనించండి. మరింత బాగా అర్థం అవుతుంది.

| PERSONS | SINGULAR | PLURAL |
|---|---|---|
| I PERSON | I | WE |
| II PERSON | YOU | YOU |
| III PERSON | HE, SHE, IT | THEY |

కర్త Singular లో గనుక వున్నట్లయితే పై మార్పులు Verb నందు జరుగుతాయి. ఇవి కాక Male Names, Females Names, Unique words, ఏవైనా Singular words లేదాPlural words కర్త(subject) గా వారబడవచ్చును.

ఇక Simple Present Tense ఎలా ఉపయోగించాలోVerb ఈ Tense లో ఎలా వాడబడుతుందో ఉదాహరణ పూర్వకంగా తెలుసుకుందాం.

**సూత్రం - 1**

This Tense is used to indicate Habituated actions

ప్రతీరోజూ అలవాటుగా చేసే పనులను చేసేటప్పుడు Verb నుSimple Present Tense రూపంలో చెప్పాలి.

ఉదా : నేను ప్రతిరోజు ఉతికిన బట్టలు ధరిస్తాను.

I wear Washed Clothes every day.

**సూత్రం - 2**

This Tense is used to indicate general or eternal truths.

ఏ కాలంలోనూ మార్పు చెందక జరిగే శాశ్వత క్రియలను చెప్పే సందర్భంలో Verb ను యిదే Simple Present Tense లో చెప్పాలి.

EARTH MOVES ROUND THE SUN

ఉదా : భూమి సూర్యుని చుట్టూ తిరుగును.

(ఇక్కడ Earth అనేదిSingular కాబట్టిmove అనే Verb Movesగా రూపాంతరం చెందింది.)

**సూత్రం - 3**

This Tense is used to indicate quotation

సుభాషితములు, పెద్దవాళ్ళు చెప్పిన సత్యములు తెలుపునప్పుడు ఇదే Tense ఉపయోగించాలి.

ఉదాహరణ : ఎల్లప్పుడు సత్యమునే పలుకుము అని గాంధీజీ చెప్పెను.

Gandhiji says always speak the truth.

**సూత్రం - 4**

This Tense is used to indicate past historic events at present time.

చరిత్రలో జరిగిపోయిన సంఘటనలను చెప్పునప్పుడు కూడా ఇదే Tense వుపయోగించాలి.

ఉదాహరణ : అశోకుడు కళింగ రాజ్యం కోసం పోరాడుతున్నాడు.

Ashoka Battle For Kaling Rajya

**సూత్రం - 5**

This Tense is used to express a fact which is true at the present time.

జరుగుతున్న కాలంలోని కొన్ని మార్పు చెందని విషయాలను చెప్పే సందర్భంలో కూడా ఈ Tense నే వాడాలి.

ఉదాహరణ : ఇప్పుడు విజయవాడకు కారు సాయంత్రం 5 గంటలకు బయలుదేరుతుంది.

Now the car for vijayawada starts by 5 p.m

**సూత్రం - 6**

This Tense is used to indicate the running incidents commentary.

ప్రత్యక్షముగా జరుగు సంఘటనలను (మీటింగులు, ఆటలు మొ॥) వర్ణించే సందర్భంలో కూడా ఈ Tense వాడతారు.

ఉదా : ప్రధానోపాధ్యాయుడు విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగిస్తున్నారు.

Head Master addresses to the students

ల్యాబ్‌లో విద్యార్థులు ప్రయోగాలు చేస్తారు.

Students do experiment in the lab

ఇలా ఎన్నో రకాలుగా Simple Present Tense లో వాక్యాలను తయారుచేయవచ్చు. వీటిలో క్రియా రూపం ఎలా వుందో గమనించారు కదా!

మీకు యింకా విపులంగా అర్థం కావటం కోసం ఈ దిగువ పట్టికను చూడండి.

| SUBJECT | VERB | OBJECT |
|---|---|---|
| Rani | scolds | Renuka |
| I | Watch | her |
| Seeta | Sings | Sweetly |
| Horse | Runs | Fast |

పైన పట్టికలో కర్త (Subject) గా Noun, Pronoun లను వాడటం జరిగింది. కర్మ (object) గా Noun (Renuka), Pronoun (her), Adverb (sweetly), Adjective (Fast) లు ఉపయోగింపబడ్డాయి. ఆయా వాక్యాలలో క్రియ ఎలా వుందో గమనించారు కదా! ఇదే విధంగా మీరు సొంతంగా కొన్ని వాక్యాలను తయారు చేయండి. అప్పుడు పై చెప్పబడిన విషయాలు అనుభవపూర్వకంగా తెలుసుకోగలుగుతారు. ఇప్పుడు రెండవ ఉప- కాలం (sub Tense) Present Continuous గురించి తెలుసుకుందాం.

## 2. PRESENT CONTINUOUS TENSE

ప్రస్తుత కాలంలో జరుగుతూ వుండే పనులను తెలిపే సందర్భాలు Present continuous Tense పరిధిలోకి వస్తాయి.

దీనిలో క్రియా రూపం Form of verb ఎలా వుంటుంది?

సాధారణంగా Present Tense లో Verb కు ing చేర్చటం వలన క్రియ (verb) Present Tense లోకి మారుతుంది. ఉదాRead (verb) reading (Present Tense verb) అయితే Present Continuous Tense రావాలి అంటే కేవలం verb కుing చేర్చితే సరిపోదు వాక్యంలో వాడిన కర్తను అనుసరించి కర్తకు సరి అయిన సహాయక క్రియ (Auxillary verb) జత చేయాలి. అలాంటప్పుడే Present Continuous Tense లో సరి అయిన Verb ను వాడినట్లు అవుతుంది.

ఈPresent Continuous Tense లో am, is, are అను మూడు సహాయక క్రియలు (Auxilliary verb) కర్త (subject) ను బట్టి జత చేయాలి.

సహాయ క్రియలు (Auxilliary verb) ఎలా ఉపయోగించాలో ఈ క్రింద పట్టికను గమనించండి.

| subject | Auxiliary verb | subject | Auxillary verb |
|---|---|---|---|
| I | am | Male name | is |
| we | are | Female Name | is |
| You | are | unique words | is |
| He | is | Any singular word | is |
| She | is | They | are |
| it | is | Any plural word | are |

పై పట్టిక వల్ల ఏ కర్త (subject) కు ఏ సహాయక క్రియ (Auxillary verb) చేర్చాలో తెలుస్తుంది. దీని ఆధారంగా కొన్ని క్రియా రూపాలను (Form of verbs) పరిశీలిద్దాము.

**ఉదాహరణ**

నేను ఇప్పుడు తింటున్నాను — Iam eating now

మేము టి.వి చూస్తున్నాము. — we are watching T.V

ఆమె స్కూటరు నడుపుతోంది. — She is riding scooter

USING PRESENT CONTINUOUS TENSE

Present Continuous Tenseఉపయోగించు సందర్భాలు

***USAGE - 1***

This tense is used to indicate an action which is going on at present time.

మనం చూస్తుండగా ఏదైనా పని జరుగుతూ వుంటుంది. ఆ పనిని గూర్చి చెప్పే సమయంలో ఈ Tense ను ఉపయోగించాలి.

***EX***

రవి టివి చూస్తున్నాడు.

Ravi is watching T.V

ఆమె నన్ను చూస్తుంది.

she is looking me

(ఇదే విధంగా మీకు దీని మీద పూర్తి పట్టు రావాలంటే కొన్ని వాక్యలను తయారు చేసుకోండి.)

*USAGE -2*

This Tense is used to describe any work that is in progress and may be continued even it is not going at the time of speaking or seeing.

ఏదైనా ఒక పని జరుగుతూ వుండి, ఇక ముందు కూడా జరుగుతుంది అని తెలిసినటువంటి (ప్రస్తుతం జరగకపోయినా) పనులను తెలిపే సందర్భంలో కూడా ఈ Tense ఉపయోగించాలి.

***EX :***

క్రికెట్ జరుగుతూనే ఉన్నది

The cricket is going on

ఆమె పుస్తకం చదువుతున్నది

She is reading a book

*USAGE - 3*

This tense is used to describe any work which is arranged to take place in near future.

ముందుగా ఒక ప్రణాళిక వేసుకున్న ప్రకారం భవిష్యత్తులో జరిగే పనులను గూర్చి తెలిపే సమయంలో ఈ Tense ను ఉపయోగించాలి.

***EX :***

విమానము మధ్యాహ్ననికి ఇక్కడ చేరుతుంది.

The Flight is reaching here this afternoon.

*USAGE - 4*

The Tense is used to describe any work whicg is arranged to take place in near fuure.

మాట్లాడే లేదా వ్రాసే వ్యక్తికి యిష్టం లేని పనులు తరుచుగా జరుగుత్నుప్పుడు అలాంటివి చెప్పవలసి వచ్చినపుడు కూడా Tense ను ఉపయోగించాలి.

రాజు ఎప్పుడు ఊహాగానాలు మాట్లాడుతారు.

Raju always gassips with othes

రవి ఎప్పుడు సిగిరెట్లు కాలుస్తూనే ఉంటాడు

Ravi is always smoking cigarattes

*USAGE - 5*

This Tense is used to tell about the work which begins definitely at a particular point of time and continues after it.

ఏదైనా పని ఒక ఖచ్చితమైన సమయానికి ప్రారంభించబడి కొనసాగే విధంగా వుంటే, దానిని తెలుపటానికి ఈTense ను వాడాలి. కాకపోతే ఇక్కడ సమయాన్ని ఖచ్చితంగా చెప్పాలి.

I am reading morning at 6'0 clock

నేను ఉదయం 6 గంటలకు చదువుతూ ఉంటాను.

**ఈ దిగువ ఇస్తున్న పట్టికలోని కొన్ని వాక్యాలను పరిశీలించండి.**

| NOUN | BEFORM | VERB+ING | NOUN/PRO/ADV/ADJ |
|---|---|---|---|
| Dilip | is | reading | Book |
| Ramu | is | Drinking | water |
| I | am | Walking | slowly |
| we | are | writing | exams |
| Siva | is | watching | T.V |
| Raju | is | learning | dance |

ఈ పట్టికలోని పదాల మాదిరిగానే మీరు కూడా కొన్ని Noun, Pronoun లో కర్తలుగా వివిధNoun, pronoun, adverb, adjective లు కర్మలుగా ఉపయోగిస్తూ మీ ఇష్టం వచ్చినన్ని వాక్యాలను తయారు చేయండి.

ఆ తరువాత Present continuous Tense లో వ్రాయటం మీకు బాగా వచ్చేస్తుంది.

## 3. PRESENT PERFECT TENSE

జరుగుతున్న కాలంలో జరిగిపోయిన పనులను చెప్పేందుకు వాడే Tense ను Present Perfect Tense అంటారు.

ప్రతి ఉప కాలం (Sub - Tense) లోనూ క్రియా రూపం మారిపోతూ(verb) ఉంటుంది. అని ముందే తెలుసుకున్నాం. ముందు రెండుsub- Tense లలో verb ఎలా రూపాంతరం చెందిందో ఉదాహరణ రూపంలో తెలుసుకున్నాం. ఇప్పుడు మూడవది అయిన Present Perfect Tense verb యొక్క రూపం ఎలా వుంటుందో పరిశీలిద్దాం

క్రియా రూపం Form of Verb

Parts of Speech ప్రతి క్రియ (verb) కు మూడు రూపాలు వుంటాయి. అని మీకు తెలిసే వుంటుంది. ఒకసారి వాటిని గుర్తు చేసుకోండి ఆ మూడు రూపాలు ఏమిటి ?

Present Tense, Past Tense, Past Participle Tense లు కదూ ! నిజమే! మీరు సరిగ్గానే గుర్తు తెచ్చుకున్నారు. ఇప్పుడు ఈ Present Tense లో పైన చెప్పుకున్న Past participle అనే యొక్క మూడవ రూపం వినియోగించాలి. అయితే కేవలం verb యొక్క రూపాన్ని వాడినంత మాత్రాన Present Perfect Tense పూర్తి అయినట్లు కాదు. మీకు తెలుసు ప్రతి వాక్యానికి కర్త (Subject) ప్రధానం. ఇక్కడ కూడా అంతే! వాక్యంలో కర్తను (Subject) ను బట్టి ఈ Present Perfect Tense లో ఒక సహాయక క్రియను Auxiliary verb ఎంచుకోవాలి. దానిని Verb కు ముందు జోడించితే Present Perfect Tense పూర్తి రూపం వస్తుంది.

Present Perfect Tense లో వాడే సహాయక క్రియ Auxillary verb లు has, Have... ఏఏ కర్తకు Has, Have అనే Auxillary Verb ఉపయోగించాలో ఈ క్రింది Table ద్వారా తెలుసుకోవచ్చు.

| SUBJECT | HAVE FORM | SUBJECT | HAS |
|---|---|---|---|
| I | have | He | Has |
| we | Have | She | Has |
| you | Have | It | Has |
| They | Have | Female names | Has |
| any | any | | |
| Plural | Have | Singular | Has |
| Word | Word | | |

ఇప్పుడు మీకు పూర్తిగా అర్థం అయి వుంటుంది. ఈ Has, Have అనే Auxillary Verb లను Verb యొక్క Past Participle రూపానికి జత చేయాలి.

దానికి ముందు Verb యొక్క మూడు Tenses లూ ఎలా వుంటాయో కొన్ని ఈ క్రింది పట్టికలో యివ్వడం జరిగింది. వాటిని పరిశీలించండి.

| PRESENT | PAST TENSE | PAST PARTICIPLE |
|---|---|---|
| Arise | Arose | Arisen |
| Abide | Abode | Abode |
| Awake | Awoke | Awaken |
| Bear | Bore | Born |
| Beat | Beat | Beaten |
| Become | Became | Become |
| Befall | Befell | Befallen |
| Beget | Begot | Begotten |
| Begin | Began | Begun |
| Behold | Beheld | Beholden/Beheld |
| Bend | Bent | Bent |
| Beseach | Besought | Besought |
| Bet | Betted | Betted |
| Bid | Bade | Bidden |
| Bind | Bound | Bound |
| Bite | Bit | Bitten |
| Bleed | Bled | Bled |
| Blow | Blew | Blown |
| Break | Broke | Broken |
| Breed | Bred | Bred |
| Bring | Brought | Brought |
| Build | Built | Built |
| Buy | Bought | Bought |
| Catch | Caught | Caught |
| Choose | Chose | Chosen |
| Childee | Child | Childden |
| Cleave | Clove | Cloven |
| Cling | Clang | Clung |
| Come | Came | Come |
| Creep | Crept | Crept |
| Deat | Dealt | Dealt |
| Do | Did | Done |
| Draw | Drew | Drawn |
| dreem | Dreamt | Dreamt |
| Drink | Drank | Draunk |
| Drive | Drove | Driven |

| | | |
|---|---|---|
| Dwell | Dwelt | Dwelt |
| Eat | Ate | Eaten |
| Fall | Felt | Felt |
| Feed | Fed | Fed |
| Fell | Felt | Felt |
| Fight | Fought | Fought |
| Find | Found | Found |
| Flee | Fled | Fled |
| Fling | Flung | Flung |
| Fly | Flew | Flown |
| Forbear | Forbore | Forborne |
| Forbid | Forbade | Forbidden |
| Forget | Forgot | Forgotten |
| Forgive | Forgave | Forgiven |
| Forsake | Forsook | Forsaken |
| Freeze | Froze | Frozen |
| Get | Got | Gotten |
| Give | Gave | Given |
| Go | Went | Gone |
| Grind | Ground | Ground |
| Grow | Grew | Grown |
| Hang | Hung | Hung |
| Hand | Hanged | Hanged |
| Hear | Heard | heard |
| Hide | Hid | Hidden |
| Hit | Hit | Hit |
| Hold | Held | Held |
| Hurt | Hurt | Hurt |
| Keep | Kept | Kept |
| Kneel | Knelt | Knelt |
| Knit | Knited | Knitted |
| Know | Knew | Known |
| Lay | Laid | Laid |
| Lead | Led | Led |
| Learn | Learnt | Learnt |
| Leave | Left | Left |
| Lend | Lent | Lent |
| Lie | Lied | Lied |

| | | |
|---|---|---|
| Lose | Lost | Lost |
| Lean | Leapt | Leapt |
| Mean | Meant | Meant |
| Meet | Met | Met |
| Mislead | Misled | Misled |
| Mistake | Mistook | Mistaken |
| Pay | Paid | Paid |
| Quit | Quitted | Quitted |
| Rid | Rid | Rid |
| Ring | Rang | Rung |
| Run | Ran | Run |
| Saw | Sawed | Sawn |
| Say | said | Said |
| See | saw | Seen |
| Seek | sought | Sought |
| Sell | Sold | Sold |
| Send | Sent | Sent |
| Sow | Sewed | Sewed |
| Shake | Shook | Shaken |
| Shave | Shaved | Shaved |
| Shed | Shed | Shed |
| Shine | Shone | Shone |
| Shoot | Shot | Shot |
| Show | Showed | Showed |
| Shrink | Shrank | Shrunk |

ఇలా కొన్ని Verb లకు మాత్రమే 3 రూపాలను పైన చూడటం జరిగింది.

ఇక ఒక చిన్న ఉదాహరణను చూడండి.

| | | |
|---|---|---|
| Present Tense | Sing | పాడుచుండును |
| past Tense | Sang | పాడుట జరిగెను. |
| Past Participle | Sung | పాడుట ఎప్పుడో జరిగిపోయింది. |

ఇలా Verb యొక్క మూడు రూపాలను వీలయినన్ని ఎక్కువ పదాలను పరిశీలించి Present Perfect Tense లో ఎక్కువ వాక్యాలు నిర్మించి చూడండి. మీకు Present Perfect Tense లో వాక్య నిర్మాణం చేయడం చక్కగా వచ్చేస్తుంది. ఇప్పుడు దీని వాడుక చూద్దామా

USING PRESENT PERFECT TENSE

## *USAGE - 1*

This Tense is used to describe a work that has just been completed.

వర్తమాన కాలంలో జరుగుతూ వుండి, అప్పుడే పూర్తి అయిన పనిని గూర్చి తెలిపే సందర్భంలో ఈ Tense ఉపయోగించాలి.

ఆమె ఇప్పుడే రాసేసింది

She has written just now.

కాలేజి ఇప్పుడే మూసివేశారు

The college has closed just now.

నేను ఇప్పుడే హోమ్ వర్క్ పూర్తి చేశాను.

I have completed home work just now.

## *USAGE - 2*

This Tense is used to say about action whose time is not known.

ఎప్పుడు జరిగిందో ఖచ్చితంగా తెలియని పనులను గురించి చెప్పవలసిన వచ్చినప్పుడు ఈ Tense లోనే చెప్పవలసి ఉంటుంది.

నేను అతనితో మాట్లాడాను.

I have talked with him

అతనూ సినిమాకి రెండుసార్లు చూశాడు

He has been twice to that cinema.

## *USGAE - 3*

This Tense is used to say about the past action that was confirmed.

జరిగిపోయిన పనిని ఖచ్చితంగా జరిగినది అని తెలిసినప్పుడు ఈ Tense లోనే చెప్పాలి.

***EX :***

రవి ఆ పనిని పూర్తిగా చేసేను.

Ravi has completed that work

సుధా బోజనం చేయటం పూర్తి చేసెను.

Sudha has finished her lunch

*USAGE 4*

This Tense is used to express an action that began in the past and it still is going on.

ఇంతకు ముందే మొదలై, ఇంకా కొనసాగుతూ వున్న పనిని గూర్చి చెప్పినప్పుడు ఈ Tense ను ఉపయోగించాలి.

*EX:*

రవి మూడు సంవత్సరాలుగా మీటింగుకి హాజరవుతూనే ఉన్నాడు.

Ravi has attented the meeting for three years

మా మావయ్య 1974 నుండి విజయవాడలోనే నివసిస్తూ ఉన్నారు.

My uncle has lived in vijayawada since 1974

| **Noun**<br>**Pronoun** | **VERB**<br>**Present Perfect Tense** | **OBJECT**<br>**Noun/Prnoun**<br>**Adverb/ Adjective** |
|---|---|---|
| Ravi | Drinked milk | Just now |
| We | have read | lessons just now |
| They | have enquired | about me |
| We | have meet | Rani just now. |

ఇలాగే మీకు సాధ్యమైన్ని వాక్యాలను Person (1st person, II person, III person) లో Verb యొక్క Auxillary Verb లు వాడుతూ Present Perfect Tense లో వాక్యాలు తయారు చేసుకోండి. మీకు ఇంకా బాగా అర్థమవుతుంది.

## 4. PRESENT PERFECT CONTINUOUS TENSE

జరుగుతున్న కాలంలో చాలా సమయం నుండీ జరుగుతూ వున్న పనులను గూర్చి చెపుతున్నపుడు Present perfecrt Tense వాడాలి.

ఇక్కడ కూడా ముందు మూడు Sub - Tense లలో లాగానే క్రియ (verb) రూపం మారుతుంది. Has been, Have Beeh అనే Auxillary Verbs లు Verb కు జతచేయాలి. అలాగే verb కు ing అనే అక్షరాలు జోడించాలి. అంటే...

Auxillary verb + Verb+ ing

ఉదాహరణకు Run అనే Verb వుంది. Present perfect continuous Tense లో Has been Running అవుతుంది. ఇక దీని సూత్రాలను కూడా తెలుసుకుందాం.

## USING PRESENT PERFECT CONTINUOUS TENSE

### *USAGE 1*

This is used to say about any work that began in the past time and is still continuing

మనం చూస్తున్న సమయం కంటే ముందే మొదలై ఇంకా జరుగుతూ ఉన్న పనిని గురించి చేప్పే సందర్భంలో ఈ Tense ను ఉపయోగిస్తారు.

నేను గంట నుండి క్రికెటు చూస్తు వున్నాను.

I Have been watching cricket for an hour

మా అమ్మ ఉదయం నుండి భోజనం తయారు చేస్తూనే వున్నది.

My mother has been cooking from the morning

### *USAGE 2*

This Tense is used for an action already completed, whose effect or result is still present

పని పూర్తి అయిపోయింది. అయినా దాని ప్రభావం కొనసాగుతుంటుంది.

రవి పరీక్ష పాసయ్యాడు. వాళ్ళమ్మ ఆ ఆనందాన్ని అనుభిస్తుంది

Ravi has been passed the exam. His mother have been enjoying the happiness

ఇలా మీకు మీ స్వంతంగా వీలయినన్ని ఎక్కువ వాక్యాలు తయారు చేసుకోండి. అప్పుడు మీకు Have, Has ఎక్కడ ఎలా వాడాలో బాగా తెలుస్తుంది. మీకు బాగా అర్థం కావాలంటే ఈ క్రింది టేబుల్‌ను చూడండి.

| SUBJECT | PRESENT PERFECT VERB CONTINUOUS TENSE | OBJECT |
|---|---|---|
| I | have been studying | B.com since 1999 |
| Sneha | has been singing | songs for 3 years |
| Prasad | has been attending | the meeting since 1998 |
| We | have been repairing | the car for 2 days |

ఈ పట్టికను చదవటం వలన మీకు Have, has ప్రయోగం బాగా తెలుస్తుంది. ఇలాగే మీకు వీలయినన్ని ఎక్కువ వాక్యాలను వ్రాయండి. శ్రద్ధగా మనసుకు పట్టించుకోండి. మీకు Present Tense గురించి చక్కగా అవగతం అయినట్లే ! ఇంతటి తో Present Tense గురించి దానిలో యొక్క మార్పును గురించి చెప్పటం పూర్తయింది.

ఇక past Tense లోకి వెళ్ళేముందు ఒక చిన్న బ్రేక్ తీసుకుందామా!

పై ఉదాహరణలోని కొన్న వాక్యాలలో For అనీ కొన్ని వాక్యాలలో Since అనీ వాడడం జరిగింది.

For కి Since అర్థం ఏమిటి? తేడా ఏమిటి? దేనిని ఎప్పుడు ఉపయోగించాలి? అనే కుతూహలం కలగడం సహజం! ఇప్పుడు For, Since గురించి తెలుసుకుందాం. వీటినే Prepositions అంటారు

## FOR

వాక్యంలో కొంత సమయం గురించి చెప్పవలసి వచ్చినప్పుడు ఆ సమయం కొన్ని గంటలో, రోజులో, నెలలో, సంవత్సరాలలో చెప్పడం జరుగుతుంది. అప్పుడు For అనే Preposition వాడాలి.

**ఉదా :**

రాణి గంట నుండి ఎదురు చూస్తుంది.

Rani has been waiting for one hour.

## SINCE

కొన్ని వాక్యాలలో జరిగే పని ఎన్ని గంటలో, ఎన్ని నిమిషాలో, ఏదైనా నెలలో, సంవత్సరంలోనో జరుగుతుందని చెప్పబడుతుంది. అలా ఖచ్చితమైన సమయం చెప్పేటపుడుSince అనే preposition వాడాలి

**ఉదా :**

నేను మధ్యాహ్నం 3 గంటల నుండి ఆపనిని చేస్తున్నాను.

I have been working that work since 3 p.m

## PAST TENSE

### భూతకాలం

భూతకాలం Past Tense లో ఉపయోగించే sub tenses

1. *SIMPLE PAST TENSE*

జరిగిపోయిన పనులను గూర్చి చెప్పునప్పుడు వాడబడే Tense ను simple past tense అంటారు.

Simple Past Tense వుండే క్రియారూపం Form of verb

ఈ Tense లో Verb past Tense లో మాత్రమే ఉండాలి. Present perfect Tense లో ఇవ్వబడిన సుదీర్ఘమైన పట్టికలో Past Tense అనే వరుస క్రింద ఇవ్వబడిన క్రియా రూపం (verb) అన్నమాట.

అంటే eat - ate - eaten

ఉదా : నేను పండు తిన్నాను I ate Fruits

USING SIMPLE PAST TENSE

*USAGE1*

This tense is used to tell about the work done in past time

జరిగిపోయిన పనులను గూర్చి చెప్పుతున్నప్పుడు ఈ Simple Past Tense లో చెప్పాలి.

***EX :*** రవి నిన్న హోం వర్కును చేశాడు.

Ravi did the home work yesterday

నేను నిన్న ఉత్తరం వ్రాశాను.

I wrote the letter yesterday

జరిగిపోయిన కాలంలో చేస్తూ వున్న పనులను ఇప్పుడు చెబుతున్న సందర్భంలో ఈ Tense ను ఉపయోగించాలి.

***EX :*** రవి క్రమం తప్పకుండా పాఠాలు చదివేవాడు.

Ravi read the lessons regularly.

స్నేహ రెండు వారాలు చెస్‌లో శిక్షణ పొందింది.

Sneha took chess training for two weeks.

***USAGE 3***

This Tense is used to discribe an action that went on for some time in the past.

జరిగిపోయిన కాలంలో కొంతకాలంలో జరిగిన పనిని తెల్పుటకు కూడా ఈ Tense ని ఉపయోగించవలెను.

అతను మూడు సంవత్సరాలు విదేశాలలో వున్నాడు.

He resided for 3 years in abroad.

రుచిత నా పనిని రెండు నెలలలో చేసింది.

Ruchita did my work for 2 months.

| SUBJECT | SIMPLE PAST TENSE | OBJECT |
|---|---|---|
| Sonu | learnt | lessons yesterday |
| Renu | sold | neckless last week |
| They | lost | money lost morning |
| Sudha | attended | the meeting last day |
| I | got | Ist rank first year |

ఇలా మీరు మరిన్ని వాక్యాలను వ్రాయండి. మళ్ళీ మళ్ళీ క్రొత్త క్రొత్త వాక్యాలను నిర్మించడం వలన మీకు చెప్పబడిన విషయం అనుభవంలోకి వస్తుంది. మీలో ఆత్మవిశ్వాసం కూడా పెరుగుతుంది.

ఇప్పుడు మనం Past continuous Tense గురించి తెలుసుకుందాం

## 2. PAST COTINUOUS TENSE

జరిగిపోయిన కాలంలో ఒక సమయంలో ఖచ్చితంగా జరుగుతూ వున్న పనులను గురించి చెప్పే సందర్భంలో వాడే Tense ను Past continuous Tense అంటారు.

Past Continuous Tense లో క్రియ (Verb) యొక్క రూపం ఎలా వుంటుందో చూడండి. ఈ Tense ఉపయోగించేటప్పుడు క్రియ verb కు ముందు was లేదా అనే were సహాయక క్రియ Auxillary Verb లలో ఒక దానిని జత చేయాలి. ఆ తర్వాత Verb కు 'ing' జత చేయాలి.

ఇక్కడ ఒక ముఖ్య విషయం ఏమిటంటే కర్త Subject ఏకవచనంలో వుంటే was అనే auxillary verb జత చేయాలి. కర్త Subject బహువచనంలో వుంటే were అనే auxillary verb జత చేయాలి. ఇక విషయం బాగా తెలిసింది కనుక ఈ Past continuous Tense లో Auxillary Verb లను ఎలా ఉపయోగించాలో ఉదాహరణ పూర్వకంగా తెలుసుకుందాం

USING PAST CONTINUOUS TENSE

*USAGE 1*

This Tense is used to express an action which was going on at some time in the past.

జరిగిపోయిన కాలంలో ఒక నిర్ణీత కాలంలో జరుగుతూ ఉన్న పనిని గూర్చి తెల్పుటకు ఈ Tense ను ఉపయోగించవలెను.

***EX:*** రమ్య సాయంత్రం ఏడు గంటలకు నోట్సు వ్రాస్తూ వుంది.

Ramya was writing notes evening by 7'0 clock

క్రిందటి రోజు వారు నీ కోసం ఎదురు చూస్తూ ఉన్నారు.

They were waiting for you last day

USAGE 2

This Tense indicates the gradual development without any time expression.

ఖచ్చితమైన సమయం తెలుపనప్పుడు క్రమంగా జరుగుతూ వుండే పనిని గూర్చి చెప్పే సమయంలో ఈ Tense ఉపయోగించాలి.

***EX:*** రవి నెమ్మదిగా నడుస్తున్నాడు

Ravi was walking slowly.

వాళ్ళు అతనిని రోడ్డు మీద కొడుతున్నారు.

They were hitting him on the road.

***USAGE3***

This Tense is used to tell about any work that was going for some period of time in the past

గతంలో కొంత సమయం వరకూ జరుగుతూ వుండిన పనులను గూర్చి తెలిపే సందర్భంలో ఈ Tense ను ఉపయోగించాలి.

***EX:*** అతను పోయిన ఆదివారం రాత్రి అంతా చదువుతూనే ఉన్నాను

He was reading entire night last sunday

నేను నిన్న ఉదయం వరకు చదువుతూనే ఉన్నాడు.

I was studying the lessons upto the last morning.

***USAGE 4***

This Tense is used to express an action which was going on at some time in the past and another action is also takes place at the same time.

జరిగిపోయిన కాలంలో ఏదైనా ఒక పని జరిగినప్పుడు అదే సమయానికి ఇంకో పని కూడా జరుగుతూ వుంటే అలాంటివి తెల్పేటపుడు ఈ Tense ను ఉపయోగించాలి.

*EX :* ప్రిన్సిపాల్ వచ్చారు. అయినా కూడా స్టూడెంట్స్ మాట్లాడుతూనే వున్నారు.

Principle was come. Eventhough the students were talking.

నేను పని చేశాను మా అమ్మ నిద్రపోతూనే ఉన్నది.

I did the wcrk, my mother sleeping upto the evening.

### *USAGE 5*

This Tense is used to say about more than one action that were going on at the same in the past. Here the conjuction 'While' will be used.

జరిగిపోయిన కాలంలో ఒకే సమయానికి ఒకటి కంటే ఎక్కువ పనులు జరుగుతూ ఉంటాయి. ఇలాంటి సందర్భాల్లో ఈ Tense ను ఉపయోగించి వాక్య నిర్మాణం చేయాలి. ఇక్కడ while అనే మాటను ఉపయోగించాలి.

*EX:* రాము చదువుతూ వుంటే రాజు టి.వి చూస్తున్నాడు.

Raju was watching T.V while Ramu was reading lessons.

ఆమె వాళ్ళమ్మకు వంటలో సహాయం చేస్తుండగా వాళ్ళ తమ్ముడు క్రికెట్ చూస్తున్నాడు.

His brother watching cricked while she was helping her mother in kitchen.

ఈ క్రింది Table శ్రద్ధగా గమనించండి. మీకు చెప్పిన విషయాలు మరింత బాగా అర్థం అవుతాయి.

| SUBJECT | FORM OF VERB IN PAST CONTINUOUS | OBJECT |
|---|---|---|
| I | was sleeping | yesterday night at 7 P.M |
| Usha | was riding | horse early morning. |
| Rani | was writing | the story last month on sunday |
| Ravi | was attending | the class yesterday at 9 P.M |

ఇలా పదికి తక్కువ కాకుండా మరిన్ని సొంతవాక్యాలు Past continuous Tense లో తయారు చేసుకోండి. అప్పుడు మీకు వీటి మీద పూర్తి కమాండ్ వస్తుంది.

# 3. PAST PERFECT TENSE

జరిగిపోయిన కాలంలో పూర్తి అయిన పనులను తెలిపే Tense ను Past Perfect Tense అంటారు.

PAST PERFECT TENSE లో క్రియా VERB రూపం

ఈ Tense లో verb యొక్క మూడవ రూపం అయిన Past participleTense ఉపయోగించాలి.

గతంలో కూడా మనం ఒకసారి ఈ Past participle tense ఉపయోగించాం ఎక్కడో గుర్తుకు తెచ్చుకోండి. కరెక్ట్ దీన్ని మీరు Present perfect continuous లో ఉపయోగించారు.

ఆ తరువాత verb కు ముందు Had అనే Auxillary Verbఉపయోగించాలి. ఇక్కడ కర్త ఏకవచనంలో ఉన్నా, బహువచనంలో వున్నా ఈ సహాయ క్రియ మారదు.

మనకు కొంత శ్రమ తగ్గిపోయింది కదా. ఏ వచనానికి ఏ సహాయ క్రియ వాడాలి అని తడుముకోవలసిన అవసరం ఉండదు.

ఇక ఈ Had అనే సహాయక క్రియ (Auxillary verb) ను ప్రయోగించి ఏ ఏ సందర్భాల్లో Past perfect Tense వాక్యాలు వ్రాయవచ్చో చూద్దాం.

USING PAST PERFECT TENSE

***USGE 1***

This Tense is used to express any action that was completed before the start of another action in the same past time.

భూతకాలంలో ఒకే సమయానికి ఒక పని జరగటానికి ముదుగా మరొక పని జరిగిపోయినట్లయితే అలాంటి రెండు పనులు తెల్పుటకు ఈ Tense ను ఉపయోగించాలి.

నేను ఇంటికి వచ్చేటప్పటికి సినిమా అయిపోయింది.

పై వాక్యంలో రెండు పనులు జరగాయి.

ఒకటవది నేను యింటికి వచ్చాను.

రెండవది అప్పటికే సినిమా అయిపోయింది.

ఇప్పుడు ఇది ఇంగ్లీషులో ఎలా వస్తుందో చూద్దాము.

Cinema had over when I reached house

ఇచ్చుట మొదట వాక్యం Past perfect లోనూ రెండవ వాక్యం Simple past Tense లో వ్రాయటం జరిగింది.

క్రికెట్ ప్రారంభం అయ్యే సమయానికినేను ట్యూషన్ నుండి వచ్చేస్తాను.

I had come to house at the time match started.

సాధారణంలో ఈ Past Perfect Tense లో రెండు పనులు గతంలోనే జరిగిపోయి ఉంటాయి. అలాంటి సందర్భాల్లో ఒక పనిని Past perfect tense లోనూ, రెండవ పనిని Simple Past Tense లోనూ చెప్పడం జరుగుతుంది.

ఈ క్రింద మరికొన్ని ఉదాహరణల వల్ల మీకు మరింత బాగా అర్థం అవుతుంది.

వర్షం మొదలయ్యేటప్పటికి అతను ఇంటికి వెళ్లిపోయాడు.

He had left the home before rained.

మేము పువ్వుల మార్కెట్‌కు వెళ్ళేటప్పటికి పువ్వులు అన్నీ అమ్మేశారు.

Flowers had sold at the we reached the flowers market.

అతను నాతో మాట్లాడుతూ ఉండగా రమ నిద్రపోయింది.

He talked with me Rama had slept.

ఇప్పుడు మీరు కొన్ని వాక్యాలను తయారు చేసుకోండి.

***USAGE 2***

This Tense used to say about an ctio in the past which denotes causes for later actions in the same past.

భూతకాలమునందు జరిగిపోయిన పనులకు కారణం చెప్పబడును. అలాంటి వాక్యములలో ఈ Tense ను ప్రయోగించాలి.

నేను ఎగ్జామ్‌కు వెళ్లలేదు. ఎందుకంటే నాకు ఎగ్జామ్ డేట్ తెలియదు.

I did not know the date of the exam. That is why I did not write the exam.

***USAGE 3***

This Tense is used to say about any action which was completed at some point of time in the past.

భూతకాలంలో ఒక నిర్ణీత సమయంలో ముగింపబడిన ఏ పనినైన సరే తెలియజేయటానికి ఈ Tense వాడాలి.

*EX:* రెండు గంటలకే మా భోజనం అయిపోయింది.

By 2'o clock our lunch had finished.

మధ్యాహ్నం 3 గంటలకే రైలు వెళ్ళిపోయింది.

Afternoon 3'O clock the train had left.

*USAGE 4*

This Tense is used in the if- clause in the impossible conditional sentences.

జరిగిపోయిన కాలంలో షరతులకు లోబడి జరగని పనులను గూర్చి చెప్పేటప్పుడు ఈ Tense వుపయోగించాలి.

*EX :* ఆమె కష్టపడి చదివుంటే పరీక్షలలో తప్పక పాసయి వుండేది.

If the studied hard, she would have passed the exams.

నేను సమయానికి వెళ్ళివుంటే అతన్ని కలిసి వుండేదాన్ని.

If I had reached on time, I would have met him

*USAGE 5*

This Tense is used to express an event which was unfulfilled wish.

గతకాలములో నెరవేరని కోర్కెలను గూర్చి తెలుపుటకు కూడా ఈ Tense వాడాలి.

*EX :* నేను గొప్ప నటుడని అయి వుండేవాడిని

I wish I had become an actor.

రవి యూనివర్సిటీ లో గోల్డ్ మెడల్ సాధించాడు.

Ravi got gold medal in the university.

*USAGE 6*

This Tense is used after 'when' between two actions that were suspected to happend at the same time in past.

గతకాలంలో ఒకేసారి రెండు పనులు జరిగాయేమోనే సంశయం కలిగినప్పుడు when అనే మాటను ఈ Tense కు ముందు వాడాలి. అప్పుడు ఒక పని తర్వాత ఒకటి జరిగినట్లు తెలుస్తుంది.

*EX :* మేము వెళ్ళేసరికి వాళ్ళు ఇక్కడికి వచ్చేశారు.

When we had reached. they came here.

ఈ క్రింది Table ను పరిశీలించండి.

| SUBJECT | VERB IN PAST PERFECT | OBJECT |
|---|---|---|
| I | had completed | homework before slept |
| Rani | Had sold | her car before 2 weeks |
| She | had came | to my house before my father left away |
| We | had reached | the railway station before the train departured |

పై టేబుల్ మాదిరిగానే మీరు కూడా కొన్ని వాక్యాలను తయారు చేసుకోండి.

## 4. PAST PERFECT CONTINUOUS TENSE

భూత కాలములో ఒక నిర్ణీత సమయానికి మొదలై కొంతకాలం జరిగి పూర్తి అయిన పనులను చెప్పే Tense ను Past perfect continuous Tense అంటారు.

VERB యొక్క రూపం

ఇక్కడ verb కు ముందు Had been అనే Auxilliary verb జతచేయాలి ఆ తరువాత Verb 'ing' కలపాలి. అప్పుడు verb past perfect continuous Tense రూపం ధరిస్తుంది.

**ఇప్పుడు కొన్ని ఉదాహరణలు చూడండి**

రవి నిన్న సాయంత్రం 4 గంటల నుండి 5 గంటల వరకూ క్రికెట్ ఆడుకుంటూనే ఉన్నాడు.

Ravi had been playing cricket yesterday since 4 P.M to 5 P.M

నేను నిన్న రాత్రి 1 గంట వరకు చదువుకుంటూనే ఉన్నాను.

I had been reading lessons up to 1'O clock last night.

## FUTURE TENSE

## భవిష్యత్ కాలం

జరగబోయే కాలాన్ని భవిష్యత్ కాలం (Future Tense) అంటారు. ఇప్పుడు భవిష్యత్ కాలంలో వాక్య నిర్మాణం ఎలా చేస్తారో ఆ సమయంలో Verb రూపం ఎట్లా వుంటుందో చూద్దాం

వర్తమాన (Present), భూత (Past) కాలాలలో లాగానే భవిష్యత్ (Future) కాలం కూడా నాలుగు రకాలుగా విభజించడం జరిగింది

## 1. SIMPLE FUTURE TENSE

భవిష్యత్తులో జరుగుతుందని తెలిసిన పనులను గూర్చి తెలిపే సందర్భంలో వాడే Tense ను Simple Future Tense అంటారు

ఇప్పుడు ఈ Simple Future Tense లో Verb రూపం ఎలా వుంటుందో చూద్దాం.

ఇప్పుడు కర్తను బట్టి ఏ కాలంలో అయినా Verb కు కొన్ని మార్పులు, చేర్పులు జరుగుతున్నాయి. వాటిని మీరు కూడా గమనిస్తున్నారు కదా !

Future Tense లో కూడా Verb కు కొన్ని Auxilliary Verb లు ముందు చేర్చడం ద్వారా Future Tense లో వాక్య నిర్మాణం సాధ్యపడుతుంది.

ఇక్కడ కర్త I, we అనేవి 1st person కు గనక చెంది వుంటే Verb కు ముందు Shall అనే Auxillary Verb జత చేయాలి.

ఇక కర్త II person లేదా III person కు చెంది వుంటే Verb కు ముందు Shall అనే Auxillary Verb జత చేయాలి. (అంటే you, he, she, it ,they మొదలైనవి అన్నీ Males names, Female names అయినప్పుడు మాత్రమే.)

ఇక్కడ మరో విషయాన్ని కూడా గుర్తుంచుకోవాలి. Verb మాత్రం ఎలాంటి మార్పు లేకుండా Present tense లోనే వుంటుంది.

*EX :* దిలీప్ చదువుతాడు Dilip shall read.

మేము వెళ్లెదము. We wil go

ఈ Simple Future Tense ఏఏ సందర్భాల్లో ఉపయోగించాలో ఇప్పుడు తెలుసుకుందాం.

USING SIMPLE FUTURE TENSE

This Tense is used to describe any action that will take place in future.

భవిష్యత్తులో జరుగుతుందని తెలిసిన ఏదైనా పని గురించి జెప్పుటకు ఈ ఉపయోగించాలి.

*EX :* నేను రేపు మీటింగుకు హాజరవుతాను.

I shall attentd the meeting tomorrow.

వాళ్ళు వచ్చే వారంలో స్కూల్లో చేరతారు.

They will join in the school next week.

| SUBJECT | FORM OF VERB IN SIMPLE FUTURE | OBJECT |
|---|---|---|
| I | shall read | lessons tomorrow |
| We | Will buy | house next month |
| Sudha | Will write | poetry in the school |
| They | Will make | the designs next week. |

ఇక మీకు దీని గురించి బాగా అర్థం అయి వుంటుంది. మరింకేం; మీరూ సొంతంగా రాయడం మొదలు పెట్టండి.

## 2. FUTURE CONTINUOUS TENSE

భవిష్యత్తులో జరుగుతూ వుంటుందని తెలిసిన పనులను గురించి చెప్పేటపుడు ప్రయోగించే Tense ను Future continuous Tense అంటారు.

ఈ Tense లో క్రియా రూపం (Form of Verb)

Simple future Tense లో Verb కు ముందు Shall అనే Auxillary Verb జోడించాం కదా! ఇక్కడ ఇంకో మాట జత చేయాలి. అది Be అంటే ఇప్పుడు Shall - Shall be అయింది. అయింది. ఆపైన Verb కు తరువాత ing జతచేయాలి. అప్పుడు Future Continuous Tense లో వాక్య నిర్మాణానికి Verb ఒక్క రూపం సిద్ధమవుతుంది.

*EX :* Shall be = sing=ing - shall be singing

Will be = play = ing - will be playing

మరొకసారి సరిగా చదవండి. మీకు పూర్తిగా అర్థం అవుతుంది. ఇక ఈ Verbal form ను ఉపయోగించి Future continuous Tense లో వాక్య నిర్మాణం ఏఏ సందార్భాల్లో చేయవచ్చో చూద్దాం.

USING FUTURE CONTINUOUS TENSE

*USAGE 1*

This Tense is used to say about an action that will be happening of future.

భవిష్యత్తులో ఒక సమయానికి తప్పక జరుగుతూ వుంటుందని తెలిసిన పనిని గూర్చి చెప్పేటపుడు ఈ Tense వాడాలి.

*EX :* మేము రేపు ఈపాటికి అతనితో మాట్లాడుతూ వుంటాను.

We shall be talking by him at this time.

సుధ వచ్చే శనివారం 7 గంటలకు పరీక్ష రాస్తూ వుంటుంది.

Sudha will be writing the exams next saturday at 7'O clock.

ఈ క్రింది Table లోని క్రియా రూపాలను పరిశీలించండి.

| SUBJECT | FORM OF VERB IN FUTURE CONTINUOUS | OBJECT |
|---|---|---|
| I | shall be leaving | the home morning at 10 A.M |
| Srinu | will be attending | at 7'O clock |
| We | will be singing | together next day |
| They | will be going | cinema next friday. |

ఇప్పుడు గురించి మీకు Future continuous Tense బాగా అర్థం కావడం కోసం మరిన్ని ఉదాహరణలు మీ ముందు వుంచుతున్నాం.

స్నేహ రేపు ఈ సమయానికి నాతో మాట్లాడుతూ వుంటుంది.

Sneha shall be talking tomorrow by this time with me.

వచ్చే నెల రాకేష్ ఢిల్లీకి వస్తూ వుంటాడు.

By next month, Rakesh will be arriving to Delhi.

మేము రేపు ఇదే సమయానికి స్టేజి మీద పాడుతూ వుంటాము.

We will be singing on the stage tomorrow at this time.

వచ్చే నెల ఇదే తారీఖున ఢిల్లీలో నా సంగీత కచేరీ జరుగుతూ వుంటుంది.

My music concert will be going on at Delhi by the same day next month

అతను రేపు ఉదయం 6 గంటలకు రేడియో వింటూ ఉంటాడు.

He will be listening poetry Radio tomorrow moring by 6'O clock.

ఇలా Future contrinous Tense గురించి పలు వాక్యాలు తయారు చేయవచ్చు. విద్యార్థులకు విపులంగా అర్థం కావటం కోసం పై పట్టికలో కర్త, కర్మలతో లో Future continuous Tense క్రియారూపం ఎలా వుంటుందో ఇవ్వడం జరిగింది.

దీనిని తర్వాత మనం Future Perfect Tense ఆ తర్వాత Future Perfect continuous Tense లను గురించి కూడా తెలుసుకుందాం. వీటితో లను గురించిన పూర్తి వివరాలు మీకు అందించినట్లే !

ఇలా మీకు వీలయినన్ని ఎక్కువ వాక్యాలను Will/shallbe = verb = ing ఉపయోగించి తయారు చేయాలి.

# 3. FUTURE PERFECT TENSE

జరుగబోయే కాలంలో ఒక నిర్ణీత సమయానికి జరిగిపోయి వుంటుందని తెలిసిన పనులను చెప్పే Tense ను Future perfect Tense అంటారు.

క్రియా రూపం FORM OF VERB

ఈ Tense లో Verb కు ముందు shall have లేదా will have అనే Auxillary verb ను కర్తను అనుసరించి జతచేయాలి.

మరి Verb ఏ కాలంలో వుండాలి? ఇక్కడ మళ్ళీ మార్పు వుంది. verb మూడవ కాలము అయిన Past participle Tense లో వుండాలి. మీకు అర్థం అయిందా? ఈ క్రింది ఉదాహరణ చూడండి.

తినడం eat అనే క్రియ Verb రూపం

shall have = ate = shall have ate

will have = ate = will have ate గా మారుతుంది.

*USAGE 1*

This tense is used to say about any action that will be completed at a particular point of time in future.

భవిష్యత్కాలంలో నిర్ణీత సమయానికి ఏదైన పని పూర్తి అయిపోతుందని తెలిసినప్పుడు దానిని గూర్చి చెప్పేటపుడు ఈ Tense వాడాలి.

రేపు సాయంత్రం 3 గంటలకు నేను ఇంటికి వచ్చేస్తాను.

I shall have come my home by 3 p.m tomorrow.

ఉదయం 10 గంటలకల్లా వంట అయిపోతుంది.

The cooking will have completed by morning 10'O clock

ఈ క్రింది Table ద్వారా మరికొన్ని వాక్యాలను పరిశీలించండి.

| SUBJECT | FORM OF VERB IN FUTURE PERFECT | OBJECT |
|---|---|---|
| I | shall have retired | my job by sep. 2003 |
| Rama | will have read | the book next day |
| Sneha | will have completed | poetry by next morning |
| we | will have drawn | money at the time tomorrow by 7 a.m |

ఇలాగే మీకు వచ్చినన్ని వాక్యాలను తయారు చేసుకోండి.

## 4. FUTURE PERFECT CONTINUOUS TENSE

భవిష్యత్కాలంలో ఒక నిర్ణీత కాలానికి ఏదైనా పని జరుగుతూ వుంటుందని వూహించి చెప్పే Tense నుFuture perfect continuous Tense అంటారు. ఇక ఈ Tense లో Form of verb ఎలా వుంటుందో చూద్దాం.

ఇక్కడ Verb కు ముందు Shall have been, will have been అనే Auxillary Verb లను కర్తను అనుసరించి వాడటం జరుగుతుంది. Continuous అని వచ్చిన ప్రతిసారీ మనం చేరుస్తున్నాం. గుర్తుంది కదా!

అదే మాదిరిగా Verb కు వెనుక Ing జత చేయాలి. అంటే ఒక వాక్యంలో Verb యొక్క రూపం ఎంత పొడవుగా వుందో చూడండి.

SHALL HAVE BEEN = EAT= ING= SHALL HAVE BEEN EATING

This Tense is used to say about any action that will be going on at a particular time which will end in future.

భవిష్యత్ లో ఒక నిర్ణీత సమయానికి జరుగుతూ వుండి పూర్తి అవుతుందని తెలిసిన పనులను చేప్పేటపుడు ఈ ను ఉపయోగించాలి.

వచ్చే సంవత్సరానికి మేము కాలేజీలో చేరి 3 ఏళ్ళు అవుతుంది.

Be next year we shall have been joing in the college for 3 years.

వచ్చే నెలకి మా తమ్ముడికి 10 ఏళ్ళు పూర్తి అవుతాయి.

MY brother has been completing his 10 years by next month

| SUBJECT | FORMOF VERB IN FUTURE PERFECT | OBJECT |
|---|---|---|
| I | shall have been | teachingin the school for 2 years |
| He | will have been | writing the lessons up to the next morning. |

ఇలా shall have been + verb + ing ఉపయోగించుకుంటూ ఇంకా కొన్ని will have been వాక్యాలు తయారు చేయాలి. దీని వల్ల మీకు అన్ని రకాల క్రియా రూపాలను ఉపయోగించడం బాగా తెలుస్తుంది.

దీని తరువాత మరో అంశాన్ని తెలుసుకుందాం.

# అధ్యాయము -3

## వాక్యములు - వాటి స్వభావము.

## DIFFERENT KINDS OF SENTENCES

ఇంగ్లీషు గ్రామర్‌లో వాక్యాలను 4 రకాలుగా విభజించడం జరిగింది.

1.Assertive sentence — సాధారణ వాక్యము

2. Negative sentence — వ్యతిరేక వాక్యము

3. Interrogative sentence — ప్రశ్నారూప వాక్యము.

4. Exclamatory sentence — ఆశ్చర్యార్థక వాక్యము

మనం మాట్లాడుటప్పుడు రాసేటప్పుడు ఈ నాలుగు రకాల వాక్యాలు మనకు తారసపడుతూనే ఉంటాయి. వాటి గురించి పూర్తిగా తెలుసుకుంటేనే కాని ఏ వాక్యం ఏ రకానికి చెందినదో తెలియదు.

ఇప్పుడు మన ఈ నాలుగు వాక్యాలు గురించి వివరంగా తెలుసుకుందాము.

## ASSERTIVE SENTENCE

ఇది మామూలు వాక్యం ఎలా వుండాలో అలాగే వుంటుంది. అందుకే దీనిని సాధారణ వాక్యం అన్నారు.

మీకు తెలుసు ఒక వాక్యం పూర్తి కావాలంటే

subject　Verb　Object

కర్త　క్రియ　కర్మ　ఉండాలి.

అలాగే కర్త subject ను అనుసరించి క్రియ Verb కాలానుగుణంగా వుండాలి. అని కూడా తెలుసుకున్నాం కదా! మరి ఆ ప్రకారం ముందు కర్త Subject. క్రియ Verb. కర్మ Object వరుసగా వ్రాస్తే ఇంగ్లీషులో సాధారణ వాక్యం త[illegible]రు అవుతుంది.

**ఈ క్రింది ఉదాహరణలను చూడండి.**

| | |
|---|---|
| నేను ఒక ఉద్యోగిని. | I am an employee |
| అతడు ఆడుతూ ఉన్నాడు. | He is playing |
| అతను సినిమాకి వెళ్ళెను. | He went to cinema |
| రవి చాలా మంచి వ్యక్తి. | Ravi is very good person |

పై వాక్యాలను మీరు పరిశీలించారా ? ఎలాంటి చిక్కులు, గందరగోళం లేకుండా చాలా సాధారణంగా ఉన్నాయి. అందుకే వీటిని సాధార[illegible] వాక్యాలన్నారు. పై ఉదాహరణలో కర్త, కర్మ, క్రియ వరుసగా వచ్చాయి. అంటే subject, verb, object లు. ఇదీ ఈ సాధారణ వాక్యం నిర్మితమయ్యే విధానం.

## NEGATIVE SENTENCE

మనం ఏదైనా ప్రశ్న వేసినప్పుడు 'అవును' లేదా 'కాదు' అనే జవాబు వస్తుంది. ఇలాంటి వాక్యాలను వ్యతిరేకార్థ వాక్యాలు అంటారు. ఈ వాక్యం ఎలా వుంటుందో చూద్దాం.

| Subject | Verb | Negative word | Object |
|---|---|---|---|
| కర్త | కర్మ | వ్యతిరేక పదం | కర్మ |

**ఇక ఈ క్రింది ఉదాహరణలు చూడండి.**

| | |
|---|---|
| అతను నటుడు కాదు | He is not an actor. |
| వారికి భాష తెలియదు | They do not know the language. |
| ఉష చదువుకోలేదు. | Usha is not an educated. |
| మేము అక్కడికి వచ్చి తినము. | We cannot come and eat. |
| అతను పరీక్ష వ్రాయడు. | He will not write the exam. |

ఈ పై వాక్యాములలో మొదటి మాట కర్త(Subject), రెండవ మాట క్రియ (Verb) మూడవ మాట వ్యతిరేకార్థం.(Not) నాలుగవది కర్మ. (Object) ఇక్కడ మీకు అనుమానం వచ్చి ఉండాలి. నాలుగవ పదం కర్మ అన్నారు కదా నాలుగవ మాటగా పై వాక్యాలలో వచ్చిన eat అనే పదం క్రియ కదా! మరి కర్మ అంటారేమిటా? అని

మీ అనుమానం నిజమైనదే ! ఇక్కడ మరొక విషయం గమనించాలి. Negative Sentence లో Verb లను కర్మ Object స్థానంలో ఉపయోగించడం జరిగింది. వీటి గురించి మరింత విపులంగా ముందు చర్చించుకుందాం.

ఇప్పుడు Negative sentence అంటే అర్థం అయింది కదా ! మరి మీరు కూడా కొన్ని స్వంత వాక్యాలను తయారు చేసే పనిలో ఉండండి.

## INTERROGATIVE SENTENCE

ప్రశ్నరూపకమైన వాక్యాలను Interrogative Sentence అంటారు. అంటే ఏదైనా ప్రశ్నించదలచుకున్నప్పుడు వాక్యాన్ని ఈ ప్రశ్నరూప వాక్యం పద్ధతిలో వ్రాయాలి. దీన్ని రెండు విధాలుగా వ్రాయవచ్చు.

| | | | | |
|---|---|---|---|---|
| | verb | Subject | Object | |
| **మొదటి పద్ధతి** | క్రియ | కర్త | కర్మ | |
| | Interrogative word | verb | Subject | Object |
| **రెండవ పద్ధతి** | ప్రశ్నరూపం | క్రియ | కర్త | కర్మ |

సాధారణంగా ప్రశ్నించడానికికొన్ని ప్రత్యేక పదాలను వుపయోగిస్తారు. వీటిని ప్రశ్నరూప పదాలు Interrogative Sentence అంటారు. ఇవి What, where, why, which, when, how, whom, whose, who అనేవి.

ఇప్పుడు ఈ ప్రశ్న రూప పదాలను వాడుతూ మొదటి పద్ధతిలో వాక్య నిర్మాణం ఎలా జరుగుతుందో చూద్దాం.

అన్నం తయారుగా వుందా? — Is meals ready ?
స్నేహ మీ అమ్మాయా? — Are sneha is your daughter ?
ఏదైనా పని వుందా? — Is there any work?
అతను అక్కడ ఉన్నాడా ? — Was he is there?

**ఇప్పుడు రెండవ పద్ధతి వాక్య రూపం**

ఈ పుస్తకం ఎవరిది? — Whose book is this ?
ఆ స్త్రీ ఎవరు? — Who is that lady ?
ఆమె ఎప్పుకు వెళ్ళింది? — When she go?
రవి ఎందుకు పరీక్ష ఫెలయిలయ్యాడు ? — Why Ravi failed in the exam?

ఈ రెండో రకం వాక్యాలలో మొదటగా Interrogative words వచ్చాయి చూశారు కదా ! ఇలా మరికొన్ని వాక్యాలను మీరు స్వయంగా తయారు చేయండి.

## EXACLAMATORY SENTENCE

వీటిని ఆశ్చర్యార్థక వాక్యాలు అని అంటారు. ఆశ్చర్యాన్నీ, దుఃఖాన్ని, అతి సంతోషాన్ని వ్యక్తం చేసేటప్పుడు కొన్ని పదాలను ఉపయోగిస్తాము. అలాంటి పదాలను ఈ Exclamatory sentences లో వస్తాయి. వీటిని సముచ్చయం అంటారు.

దీనిలో వాక్యరూపం చూడండి.

| Interjuction | Subject | Verb | Object |
|---|---|---|---|
| సముచ్ఛయము | కర్త | క్రియ | కర్మ |

**ఉదాహరణ :**

| | |
|---|---|
| ఆహా! ఆ అమ్మాయి ఎంత బాగుంది. | Ah! How pretty that girl |
| హుర్రే! ఇండియా గెలించింది | Hurrah! India won the match |
| అయ్యో! అతను చనిపోయాడా ? | Alas! he is dead |

ఇలా పలురకాల సందర్భాల్లో రకరకాల మనోభావాలను ఈ Exclamatory sentences ద్వారా వ్యక్తపరచుకోవచ్చు. ఇలాంటి వాక్యాలకు చివర ! ఉంటుంది. ఆగుర్తును 'ఆశ్చర్యార్థక చిహ్నం' Exclamatory sentences అంటారు.

ఇప్పుడు మరికొన్ని ఆశ్చర్యార్థక వాక్యాలనూ మీరూ తయారు చేయండి.

వాక్యాలు వాటిలో గల నాలుగు రకాలునూ మీరూ ఇంత వరకు తెలుసుకున్నారు. దీని ద్వారా వాక్య స్వరూపం పూర్తిగా అర్థం అయింది కదా!

# అధ్యాయము -4

## సహాయక క్రియలు

## AUXILLARY VERBS

గతంలోTense గురించి చెప్పుకున్నప్పుడు సహాయక క్రియలు Auxillary Verbs కొన్నింటిని ప్రయోగించడం చూశాం Auxillary Verbs గురించి కొంత అవగాహన కలిగి వుండాలి. ఇప్పుడు ఈ అధ్యాయంలో Auxillary Verb ల గురించి విపులంగా తెలుసుకుందాం.

ఈ క్రింద కొన్ని Auxillary Verbs ఇస్తున్నాం

| | | | |
|---|---|---|---|
| 1. | Am | : | ఉన్నాను |
| 2. | Is | : | ఉన్నది / ఉన్నారు |
| 3. | Are | : | ఉన్నారు / ఉన్నవి / ఉన్నాము |
| 4. | Was | : | ఉండెను / ఉంటివి |
| 5. | Were | : | ఉంటిమి, ఉండినవి |
| 6. | Has | : | కలిగి వున్నది / కలిగి వున్నాడు |
| 7. | Have | : | కలిగి యున్నాను / కలిగి యున్నారు / కలిగి వున్నవి |
| 8. | Had | : | కలిగి యుంటిని / కలిగి యుంటిమి / కలిగి యుంటిరి |
| 9. | Do | : | చేయుట / చేయుదును / చేయుదుము/ చేయుదురు |
| 10. | Does | : | చేయును / చేస్తుంది / చేస్తాడు |
| 11. | Did | : | చేసితిని / చేసితిరి / చేసితిమి / చేసినాడు / చేసినది |
| 12. | Shall | : | ఈ రెండింటినీ భవిష్యత్తు కాలమును చూపుటకు |
| 13. | Will | : | Main Verb నకు సహాయంగా ఉపయోగించాలి. |
| 14. | Should | : | విధిని, నిషేధములను, సలహాలనిచ్చు వాక్యములందు ఉపయోగించాలి. |
| 15. | Would | : | Past Fututre Tense లోను, మరియు షరతులతో కూడిన వాక్యము లందు ఉపయోగించాలి. |
| 16. | Could | : | దీనిని వీలవుతుంది అనే అర్థం వున్న విషయాలు చెప్పునపుడు subject నకు ముందు ఉపయోగించాలి. |
| 17. | May | : | ఏదేని అవకాశం వుండి జరగుతుందని తెలిసినటువంటి విషయములకు సంబంధించి subjeet ముందు ఉపయోగించాలి. |
| 18. | Can | : | దీనిని కూడా చేయుటకు వీలవుతుంది అను అర్థములో నున్న విషయాలను తెలుపుటకు ఉపయోగించాలి. |
| 19. | Must | : | తప్పక ( ఈ అర్థంలో గల విషయములను తెలుపుటకు ఉపయోగించాలి) |

20. Might : వచ్చాను/వచ్చును (ఈ అర్థంలో వున్న విషయములు తెలుపుటకు ఉపయోగించాలి)
21. Dare : సాహసించు ఈ Verb ను చాలా అరుదుగా ఉపయోగించడం.
22. Need : అవసరముండు
23. Ought : వలసినది జరుగుతుంది. వీటిని ప్రధాన క్రియలుగా సహాయ క్రియలుగా రెండు వైపులా ఉపయోగించవచ్చును.
24. Used : అలవాటుపడు

ఇవి మొత్తం 24 రకాల Auxillary Verbs లు. వీటిని ఎక్కడెక్కడ ఏఏ సందర్భాల్లో ఉపయోగించాలో ఇప్పుడు తెలుసుకుందాం.

## BE FORMS

Am, is, are, was, were అనే వాటిని Beforms అంటారు.

*USAGE 1*

ఈ beforms లో దేనినైనా Present tense ముందు ఉపయోగిస్తే Present Past continuous sentences ఏర్పడతాయి.

**ఉదాహరణ :**

| | |
|---|---|
| 1. నేను పరీక్షలు వ్రాస్తున్నాను. | I am writing exams |
| 2. రవి డిల్లీకి వెడుతున్నాడు | Ravi is going to delhi |
| 3. మేము అతని కోసం ఎదురు చూస్తున్నాము | We are waiting for him |

ఈ పై వాక్యాలు present continuous Tense లో ఉన్నాయని తెలుస్తోంది. ఇప్పుడు Past continuous కు చెందిన వాక్యాలు చూద్దాం.

| | |
|---|---|
| 1. స్నేహ వంట చేస్తూ ఉంది. | Sneha was cooking |
| 2. వారు నోట్సు వ్రాస్తూ ఉన్నారు. | The were writing notes |

*USAGE 2*

Beforms పదాలను వాక్యంలో కర్త (subject) కు ముందు చేర్చితే ప్రశ్నార్థక వాక్యాలు (interrogative sentence) పుడతాయి. అయితే present Tense లో లేదా జరుగుతూ వున్న పనులకు మాత్రమే ఈ విధంగా ఉపయోగించాలి.

ఉదాహరణ

1. మీరు మాతో పాటు పార్టీకి వస్తున్నారా ?
   Are you joining with us in the party.
2. రవి వాళ్ళ అబ్బాయా?
   Is Ravi their son? ( Present Tense)

ఇప్పుడు Past Tense లో

1. వారు మైదానంలో ఉన్నారా ?
   Were they in the play ground
2. అతను చెడ్డవాడా ?
   Was he bad?

*USAGE 3*

Beforms ప్రక్కన Not అనే పదాన్ని వాక్యంలో చేర్చితే వ్యతిరేక వాక్యాలు ఏర్పడతాయి. Negative Sentences.

| | |
|---|---|
| 1. ఇది నా కారు కాదు | This is not my car. |
| 2. అతను అక్కడ లేదు. | He is not there |
| 3. వారు పాడటం లేదు. | They were not singing songs |

ఇలా Am, is, are, was, were అనే Beforms ఉపయోగిస్తూ Present Tense, Past Tense లలో వాక్యాలు తయారు చేయవచ్చు.

మీరు కూడా మీకు వీలయినన్ని ఎక్కువ వాక్యాలు తయారు చేయండి.

*USAGE 4*

కొన్ని కొన్ని వాక్యాలలో ఒక గమ్మత్తు వుంటుంది. కర్మ, క్రియ, కర్మ కలిస్తే వాక్యం కదా! మరి ఇలాంటి వాక్యాలలో అసలు కర్త ఎవరో ఖచ్చితంగా తెలియదు. మరి వాక్యం ఎలా పూర్తి కావాలి? ఇలాంటి సందర్భాల్లో కొన్ని మాటలు this, that, these, those, there ఇలాంటి మాటల తరువాత ఈ "Be forms" లో ఏదైనా ఉపయోగిస్తే అవి ప్రధాన క్రియలుగా ఉపయోగపడి వాక్యం తయారు అవుతుంది.

| | |
|---|---|
| 1. ఇది ఒక బస్సు | That is a bus |
| 2. ఇది తప్పు | This was false |
| 3. వారు పాకిస్థానీయులు | They are pakistanies |
| 4. ఇవి కొన్ని పువ్వులు | These were some flowers |
| 5. మంచం క్రింద పిల్లి ఉంది. | There is a cat under the cat. |



ఇక్కడ is, was, am, are were అనేవి ప్రధాన క్రియలుగా [illegible]

కాలాన్ని కూడా తెలియజేస్తాయి. కనుక ప్రత్యేకంగా కాలాన్ని సూచించే మాట వ్రాయనక్కరలేదు.

అంటే This is a book ఇది ఒక పుస్తకము అంటే సరిపోతుంది. అంతే కానీ ఇది ఒక పుస్తకము అయి వున్నది అని అనక్కరలేదు. అలాగే ఇతర కాలాలకు సంబంధించి కూడా!

*USAGE 5*

దూరం(Distance), కాలము(Time), బరువు(weight), పరిమాణము(size) ధర (Price), తారీఖులు(Dates),వాతావరణం(Weather) ని సూచించదానికి ఈ Be forms లో దేనినైనా సరే ప్రధాన క్రియకు బదులుగా ఉపయోగించుకోవచ్చు.

**ఉదాహరణ**

1. అతను రెండు కిలోమీటర్ల దూరంలో ఉన్నాడు.
   He is there in two kilometers.
2. నేను 50 కిలోల బరువు వుండేవాడిని.
   I was50 kgs
3. ఇప్పుడే మ్యాచ్ మొదలయింది.
   Now the match starts.

ఇలాగే మీరు కూడా కొన్ని వాక్యాలు తయారు చేయండి.

Be forms లో కొన్ని Present Tense కు సంబంధించి వుంటాయి. కొన్ని Past Tense కు చెంది వుంటాయి. Am, is, are, present tense, was, were లు Past Tense ఈ క్రింది పట్టిక ద్వారా మరింత విపులంగా అర్థంఅవుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | Iam | నేను ఉన్నాను | I was | నేను ఉండేవాడను |
| 2. | Ravi is | రవి ఉన్నాడు | Ravi was | రవి వుండేవాడు |
| 3. | Sudha | సుధ ఉన్నది | Sudha Was | సుధ ఉండెడిది. |
| 4. | It is | అది ఉన్నది | It was | అది వుండెడిది. |
| 5. | you are | నీవు వున్నావు | You were | నీవు వుండెడివాడవు. |
| 6. | we are | మేము ఉన్నాము | we were | మేమువుండెడి వారము |
| 7. | They are | వారు ఉన్నారు | They were | వారు వుండెడి వారు |
| 8. | It is | ఇది ఉన్నది | It was | ఇది ఉండెడిది |
| 9. | That is | అది ఉన్నది | That was | అది ఉండెడిది. |

ఇక మీరు ఇప్పుడు బాగా అర్థం అయి ఉంటుంది.

# DO-DOES-DID

వీటిని Do Forms అంటారు. వీటిలో Do/Does లను వర్తమాన (Present) కాలంలో Did ను భూత (Past) కాలంలోనూ ఉపయోగించాలి. అలాగే I person గానీ, II person గానీ II person plural subject ఉన్నప్పుడూ Do ఉపయోగించాలి. II person singular subject వచ్చినప్పుడు Does వాడాలి తెలిసింది కదా!

ఇప్పుడు వీటినిఉపయోగించే విధానం తెలుసుకుందాం.

ఇక్కడ ఒక విషయం గమనించండి. Do, Does, Did లు వాక్యంలో Auxillary Verbs గానూ, Principle Verbs గానూ కూడా సందర్భానుసారం ఉపయోగపడతాయి.

***USAGE 1***

Do,did, Does అనే వాటిని కర్త (Subject) కు ముందు ఉపయోగిస్తేప్రశ్నార్థక వాక్యాలు (Interrogative Sentences) పుడతాయి. ఈ వాక్యాలు సామాన్య, వర్తమాన, సామాన్య భూత (Simple Present, Simple Past) కాలాలకు చెంది ఉంటాయి.

**ఉదాహరణ:**

1. నీవు కాలేజీకి వస్తావా ? — Do you come college?
2. అతనికి హిందీ వచ్చా? — Does he know Hindi ?
3. సుధ పరీక్ష వ్రాసిందా? — Did sudha write the exam?

Be forms కూ, Do forms గల తేడా గమనించారా? పై వాక్యాలు చూడండి Be forms అయిన Am/is/are/was/were లు ఉపయోగించి వ్రాసే వాక్యాలు Simple Tense లో వుంటాయి.

ప్రశ్నార్థక(Interrogative) వాక్యాలు (Sentences) వ్రాయాలి అంటే పై విధంగా వ్రాయాలి. అప్పుడు Simple interrogative Sentence ఏర్పడతాయి.

***USAGE 2***

Do Forms తరువాత 'NOT' అనే మాటను చేర్చితే వ్యతిరేక వాక్యాలు (Negative Sentences) ఏర్పడతాయి. ఇవి Simple Present/Simple Past Tense) లకు చెంది వుంటాయి.

ఉదాహరణ :

1. వారు సినిమాచూడరు

They Do not see films

2. ఆమె తన పిల్లల పట్ల శ్రద్ధ చూపదు.

She Doesnot take care of her childrens

3. రాజు నిన్న హోమ్ వర్క్ పూర్తి చెయ్యలేదు.

Raju Didnot do home work yesterday

*USAGE3*

వాక్యంలో కర్తకు తరువాత క్రియా రూపానికిబదులుగా Do, Does, Did లను ఉపయోగించడం వల్ల క్రియాపదం లేకుండానే Assertive Sentences రూపొందుతాయి.

ఉదాహరణ

1. నేను తోటపని చేస్తాను I do gardening

2. అతను దీనిని చేయడు He does this

3. వారు పార్టీని బాగా చేశారు They did not party very well.

చూశారుగా ! పై మూడు వాక్యాలలో ఎక్కడైనా క్రియ (verb) పదం ఉందేమో చూడండి. లేదు పైగా ఆ క్రియా పదం స్థానాన్ని Do Forms లో ఒక పదం భర్తీచేయడం గమనించండి. ఇప్పుడు పై సూత్రం మీకు బాగా అర్థం అయి వుంటుంది.

ఇది DO, Does, Did అనే Do Forms ఉపయోగాలు.

# HAS-HAVE-HAD

వీటిని Have Forms అంటారు. Present Perfect Tense లో Has, Have లను ఉపయోగిస్తారు. Past Perfect Tense లో Had ను ఉపయోగిస్తారు. Has, Have, Had లను Past Participle Tense రూపంలో వుండే Verb కు ముందే ఉపయోగించాలి. కొన్ని సందర్భాల్లో ఇవే principle Verb గా కూడా వాడవచ్చు. ఇప్పుడు ఆ వివరాలు చూద్దాం.

*USAGE 1*

Has, have, had లలో ఒకదానికి Past Participle Verb కు ముందు వాడితే Present/Past perfect Tense వాక్యాలు ఏర్పడతాయి.

1. ఆమె ఇంతకు ముందే వచ్చింది.

   She has come just now.

2. కృష్ణ ఇప్పుడే చెన్నై నుండి వచ్చాడు.

   Krishna has come from Chennai just now.

3. అతను రాక ముందే మేము వెళ్ళాము.

   We had go before he come.

*USAGE 2*

Has, Have, had లలో దేన్నైనా వాక్యంలో Been కు ముందు వుపయోగిస్తే Present/Past perfect continuous వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. పవన్ సాయంత్రం నుండీ ఎదురు చూస్తూ ఉన్నాడు.

   Pavan has been waiting since evening.

2. రెండు రోజులుగా మీటింగు జరుగుతూనే ఉన్నది.

   The meeting has been held for two days.

3. నెల రోజులుగా వారు ప్రాక్టీసుకు వెళుతూనే ఉన్నారు.

   They have been going practice for one month

*USAGE 3*

Have forms ను Subject కు ముందు ఉపయోగించితే ప్రశ్నార్థక వాక్యాలు interrogative Sentences ఏర్పడతాయి.

Be Form, do forms ఉపయోగించికూడాInterrogative Sentence వ్రాయవచ్చని గతంలో తెలుసుకున్నాం కదా !

Past Perfect Tense కు చెందిన వాక్యాలు ఈ కోవలోకి వస్తాయి.

**ఉదాహరణ**

1. నీవు సినిమా చూసేశావా?

   Are you seen that film?

2. ఆమె ఢిల్లీ నుండి వచ్చేసిందా ?

   Has she come from Delhi?

3. ఆమె ఇంటి నుండి వెళ్ళిపోయిందా ?

   Had she left from the home?

ఇలాంటి ప్రశ్నార్థక వాక్యాలను వ్రాయాల్సి వచ్చినప్పుడు ఇలాగే వ్రాయాలి.

Has, Have, had ల ప్రక్కన To అనే Infinite కనుక చేర్చితే 'తప్పక చేయాలి' అనే అర్థం వచ్చే వాక్యాలు ఏర్పడతాయి. ఇక్కడ Verb ను Simple present Tense లో వ్రాయాలి.

Has + to+ Go = Has to go
Have + To + Give = Have to give
Had + To + See = Had to see

ఇలా Verb లో కూడి పదాలు తయారవుతాయి. ఇక వాక్యాలు ఎలా వుంటాయో చూద్దాం.

**ఉదాహరణ**

1. అతను తప్పక ఆడి తీరాలి.

He has to play.

2. నేను తప్పక స్కూలుకు వెళ్ళి తీరాలి.

I have to go school.

3. వారు తప్పక అక్కడ నీ కోసం ఎదురు చూస్తూ ఉంటారు.

They had to wait there for you.

ఇలా మరికొన్ని వాక్యాలు తయారు చేయండి.

*USAGE 5*

Have పదానికి ముందు Must/should/would వంటి పదాలు చేరిస్తే ఇతర అర్థవంతమైన వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. రవి ఆ పుస్తకాన్ని తప్పక రాసి తీరాలి.

Ravi must wrote that book.

2. మేము క్రికెట్ చూసి వుండేవాళ్ళము.

We would have see the cricket.

3. వారు తప్పక గెలిచి తరాలి.

They should have win the game.

గమనిక: Should/would అనేవి Have కు ముందు చేర్చేవి. ఇవి షరుతులతో

కూడిన వాక్యాలలో వాడతారు. వీటి ప్రక్కన 'NOT' అనే పదం చేరిస్తే వ్యతిరేకార్థక Negative Sentances ఏర్పడతాయి. వాటి గురించి ముందు ముందు తెలుసుకుందాం.

*USAGE 6*

Have కు ముందు Shall /will అనే పదాలను చేర్చినప్పుడు Future perfect వాక్యాలు ఏర్పడును.

**ఉదాహరణ**

1. రేపు ఈ పాటికి రవి హోం వర్క్ పూర్తి చేసి వుంటాడు.

   Ravi shall have completed home work by this time tomorrow

2. మేము వచ్చే సంవత్సరానికి కాంట్రాక్టును పూర్తి చేస్తాము.

   By nexy year we will have completed the contract.

*USAGE 6*

Have కు shall/will వంటి పదాలతో పాటు Have కు తరువాత 'NOT' అన్నపదం చేరిస్తే Future Perfect కు చెందిన Negative వ్యతిరేక పదాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నేను వచ్చే నెలకల్లా అక్కడికి చేరలేను.

   I shall have not reached there by next month.

2. అతను సాయంత్రానికి డబ్బు వాపసు చెయ్యలేదు.

   He will not returned the amount by evening.

ఇలా Has, have,had లు ఉపయోగించి అసంఖ్యాకమైన పదాలను సృష్టించవచ్చును.

ఈ Auxillary Verbs లో ఒక్కొక్కటి ఒక్కొక్క విధమైన వాక్యాలు తయారు చేస్తాయి. ఈ టేబుల్‌ను పరిశీలించండి. ఇంకా బాగా అర్థం అవుతుంది.

ప్రక్క పట్టికలోని వాక్యాలను గమనించండి. Be Forms am, is are was, were లు ఏ కాలంలో అయినా Continuous వాక్యాలు రాయడానికి Do Forms అయిన Do, Does, Did లు Simple Tense వాక్యాలు రాయడానికి Have Forms అయిన Has, have, had లు Perfect Tense వాక్యాలు రాయడానికి ఉపయోగపడతాయి అని తెలుస్తుంది.

| SENTENCE | BE FORMS | DO FORMS | HAVE FORMS |
|---|---|---|---|
| **PRESENT TENSE** | | | |
| Assertive | He is an actor | I kill him | I have completed the work |
| Negative | He is not an actor | I do not him | I have not completed the work |
| Interrogative | Is he an actor | Do you kill Him | Have I completed the work |
| **PAST TENSE** | | | |
| Assertive | He was dancing | I wrote a letter. | I had paid the fee. |
| Negative | He was not dancing | I did not write a letter | I had not paid the fee. |
| Interrogative | Was he dancing? | Did I write a letter | Had I paid the fee? |

## SHALL - WILL - WOULD- SHOULD

ఇవి ఇంగ్లీషు భాషలో కొన్ని ప్రత్యేక పదాలు. ఇవి కేవలం సహాయ క్రియలుగా ఉపయోగపడతాయి. భవిష్యత్ కాలాన్ని చూపించడానికి వినియోగించే ఈ పదాలను ప్రత్యేకంగా అర్థం అంటూ వుండదు. అందువల్ల ఇవి ప్రధాన క్రియలుగా వినియోగపడవు.

Shall : దీనిని ఎప్పుడూ I person Pronoun ప్రక్కనే వాడాలి.

Will : దీనిని II/III Person లో Pronoun ప్రక్కనే వ్రాయాలి.

ఇక వీటి ప్రక్కన వచ్చే Verb ఎప్పుడు Simple Present Tense లో మాత్రమే వుండాలి. వీటిని కర్త (subject) ప్రక్కన వాడినా Verb Present Tense లో వుండాలి.

### *USAGE 1*

Shall, Will అనే పదాలను Simple Present Tense లో వున్న క్రియ Verb కు ముందు వాడితే Simple Future Tense లో వాక్యం తయారవుతుంది.

**ఉదాహరణ**

1. అతను ఇవాళ ఆఫీసుకు వెడతాడు.

   He will go the office today.

2. ఆమె వచ్చే వారంలో ఎగ్జామ్స్‌కు వెడుతుంది.

   She will attend the exams next week.

ఒక దృఢ సంకల్పంDetermination, వాగ్దానంPromise, ఆజ్ఞ Command బెదిరించడం Threat వంటివి ప్రకటించే వాక్య నిర్మాణంలో కూడా Shall/will ఆ భావాలను ప్రకటిస్తాయి.

**ఉదాహరణ :**

1. నేను గోల్డ్ మెడల్ సాధిస్తాను.

   I shall have get gold medal (Determination)

2. నేను దాన్ని పూర్తి చేస్తాను.

   I will do this work (Promise)

3. నువ్వు అక్కడికి వచ్చి తీరాలి.

   You will come there (Command)

4. నేను నీ అంతు చూస్తాను.
   I will see your end

*USAGE 3*

Shall/ will ప్రక్కన 'Not' అనే మాట చేర్చితే Negative sentences వ్యతిరేక వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నేను స్కూటరును నడుపలేను.

   I Shall not ride the bike.

2. రవి అలా చెప్పలేడు.
   Ravi will not say like that.

*USAGE 3*

Shall/will లను కర్త (subject) కు ముందు చేర్చితే ప్రశ్నార్థక వాక్యాలు ( (Interrogative Sentences) ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. రమ పరీక్ష రాస్తుందా?

   Will Rama write the exam?

2. నేను శెలవు తీసుకోవచ్చా?
   Shall I take leave.

# SHOULD /WOULD

Shall /will అనే సహాయక క్రియ (Auxillary Verbs) యొక్క Past Tense రూపాలే SHould/would అందువల్ల Shall/will ల లాగే Should / would లను కూడా షరతులతో కూడిన వాక్యం (conditional sentences) లు రాయటానికి ఉపయోగిస్తారు.

ఏఏ షరతులతో Should/would వాడతారో చూడండి.

1. Probable conditional sentence

ఏదైనా పనిని షరతులకు లోబడి జరగాలని చేప్పె వాక్యం

2. Improbable conditional sentence.

దాదాపు జరగని పనిని గూర్చి చెప్పే వాక్యం

3. Impossible conditional sentance.

అసాధ్యమైన పనులను లేదా షరతులను చెప్పే వాక్యం.

ఇప్పుడు ఈ మూడు రకాల వాక్యాలనూ చూద్దాం!

## 1. PROBABLE CONDITIONAL SENTENCE

అతను ప్రయోగాన్ని జాగ్రత్తగా చేసి వుంటే ఆ ప్రయోగం సఫలం అయ్యేది.

ఈ వాక్యలో షరతు : జాగ్రత్తగా పని చేసి ఉంటే

పని : ప్రయోగం సఫలం కావటం.

If he do that experiment carefully it will be completed successfully.

## 2. IMPROBABLE CONDITIONAL SENTENCE

స్నేహ అతన్ని చూసి ఉంటే మాట్లాడి ఉండేది.

షరతు : చూసి వుంటే

పని : మాట్లాడి ఉండటం.

If Sneha saw him. She would talk.

(ఇక్కడ పని జరిగిపోయింది అంటే మాట్లాడటం జరగలేదు. అంటే షరతు నెరవేరలేదు అనేగా అర్థం!)

ఇప్పుడు వాక్యం చూడండి.

If Sneha saw here she would talk her.

(వాక్యం Past Tense లో ఉంది చూశారు కదా ! అంటే ఈ వాక్యాలను షరతులు జరగని అంటే జరిగిపోయిన సంఘటనల గురించి చెప్పేటప్పుడు చాలా రాయాలి.)

3. *IMPOSSIBLE CONDITIONAL SENTENCE*

రవి ముందుగా వెళ్ళి వుంటే ఆమెని కలుసుకునేవాడు.

షరతు : ముందుగా వెళ్ళడం

పని : ఆమెని కలుసుకోవడం.

(ఇక్కడ వాక్యం Past Tense లో వుంది. అంటే అతను ముందుగా వెళ్ళలేదు. కనుక ఆమెను కలుసుకోలేకపోయాడు. అంటే వాక్యంలో షరతు నెరవేరలేదు. పని కూడ జరుగలేదు) ఇప్పుడు వాక్యం చూడండి.

If sudha gone after a few minutes. He would have met C.M

ఇతర వాక్యాలకూ మూడు వాక్యాలకు గల ప్రధానమైన తేడా గమనించారా? వాక్యం రెండు భాగాలుగా విడిపోయింది కదా! అని

1) షరతు 2) పని : దీనినే ఇంగ్లీషులో

1. If clause 2. Main Clause.

3 రకాల Conditional sentence లో వాక్య నిర్మాణ పట్టిక.

**MODEL STRUCTURE OF CONDITIONAL SENTENCE**

**condition** **'If'clause** **'main' clause**

1. Probable : If+subject+Present Tense+Verb+ Object Subject+Simple Future+Verb+Object

2. Imporbable : If+subject+Past Tense+Verb+Object Subject+would+Presentence Verb+Object

3. Impossible : If+subject+Past perfect Tence verb+ Object+Subject+Would+Present Perfect Tense verb+ Object

ఇక Would / Should ఉపయోగించే విధానాలు చూద్దాం.

***USAGE 1***

Conditional Sentences (షరతులతో కూడిన వాక్యాల) లో I person Subject (కర్త) ప్రక్కన Should, II/III persons Subject (కర్త) ప్రక్కన would ఉపయోగిస్తే జరిగేది జరిగి వుండవలసినది వంటి అర్థవంతమైన వాక్యాలు రూపొందుతాయి.

**ఉదాహరణ**

నువ్వు అక్కడికితొందరగా వెళ్ళి వుంటే మీ అమ్మని కలుసుకుని ఉండేదానివి.

If you went there early, you would have met your mother.

*USAGE 2*

Should /Would ప్రక్కన 'Not' లేదా 'Have Not' పదాలు చేర్చితే వ్యతిరేకార్థక వాక్యాలు (Negative Sentences) ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. అతను ఆమెను చూడటానికి అక్కడికి వెళ్ళకూడదు.
   He should not go there to see her (Future tense)
2. నువ్వు డబ్బు తీసుకోకుండా వుండాల్సింది.
   You would have not drawn the money (Past Tense)

*USAGE 3*

ఇక మళ్ళీ మొదటికి వస్తే Shall/will/should/would ఈ నాలుగు రూపాల సహాయ క్రియలు ఉపయోగించి మర్యాద పూర్వక వాక్యాలు నిర్మించవచ్చును. Polite Sentences

1. నాకు నీ డ్రెస్ ఇవ్వగలవా?
   Shall you give me this dress?
2. నాకు ఒక గ్లాసు మంచి నీళ్ళు ఇప్పించగలరా?
   Will you provide me a glass of water?
3. నేను మా అమ్మతో మాట్లాడాలనుకుంటున్నాను.
   I should like to talk my mother.
4. మీరు అక్కడ కూర్చోవడానికి ఇష్టపడతారా?
   Would you like to sit on that chair.

## MODEL AUXILLARY VERBS

Can, could, must, may,might, need, aught, dare, used అనే తొమ్మిదిటిని Model Auxillary Verbs అంటారు. ఇప్పుడు వీటి గురించి వివరణాత్మకంగా తెలుసుకుందాము.

*CAN :*

Can అనే మాటలకు 'నా వల్ల అవుతుంది' అనే అర్థం చెప్పుకోవచ్చు. దీనిని వాక్యాలలో ఏ విధంగా ఉపయోగిస్తారో చూద్దామా.

**ఉదాహరణ**

1. I Can go there
నేను అక్కడికి వెళ్ళగలను.

2. They Can win the match.
వారు మ్యాచ్ గెలవగలరు.

*USAGE 2*

Can ప్రక్కన 'Not' చేర్చితే వ్యతిరేకార్థక వాక్యాలు ఏర్పడతాయి. అప్పుడు 'వల్లకాదు', సాధ్యకాదు' వీలు పడదు' అనే అర్థాలు వచ్చే వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నేను తమిళం మాట్లాడలేను

   I can not speak Tamil.

2. అతనితో మనము మట్లాడలేము.

   We can not talk with him.

*USAGE 3*

Can ప్రక్కన Be అను పదాన్ని చేరిస్తే 'చేయగల' 'కాగల' వంటి భవిష్యత్ Future వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. మనం అక్కడికి వెళ్ళవచ్చును.

   We can be go there.

2. అతను ఆ స్కూలు ప్రిన్సిపాల్ అయి వుండవచ్చు.

   He may be principle to that school.

*USAGE 3*

Can ను వాక్యంలో కర్త (Subject) కు ముందు వుపయోగిస్తే ప్రశ్నార్థక (Interrogative) వాక్యాలు ఏర్పడతాయి. చేయగలవా? వీలవుతుందా? అనే అర్థాలను ఇస్తుంది.

**ఉదాహరణ**

1. నాకు అతని గురించి తెలుస్తుందా?

   Can I know about him?

2. అతను పరీక్ష రాయగలడా?

   Can he write the exam?

అర్థం అయింది కదా! మరి మీరు కూడా కొన్ని వాక్యాలను తయారు చేయడానికి సిద్ధంగా ఉన్నారా?

## COULD

Can అనే మాటకు భూతకాల (Past) సూచిక (For) యే Could అనేది వాక్యం Present Tense లో ఉన్నప్పుడు "Can" ఉపయోగిస్తాం. అదే వాక్యం Past Tense లో 'Could' ఉపయోగించాలి. దీనికి వీలుఅయింది. సాధ్యపడింది, చేయగలిగాను అనే అర్థం రావడం కోసం వాడతారు.

*USAGE 1*

Could ను కర్త (Subject) కు తరువాత ఉపయోగించాలి. ఇది 'వీలయినది' అనే అర్థాన్ని ఇస్తుంది. మరొక రకంగా చెప్పాలీ అంటే ఇంతకుముందు జరిగిన కాలంలో సాధ్యపడిన, చేయగలిగిన పనులను అంటే Past ability గురించి చెప్పే సందర్భాల్లో could ను ఉపయోగించాలి. ఇప్పుడు కొన్ని ఉదాహరణలను పరిశీలిద్దాము.

1. నువ్వు చిన్నతనంలో బాగా పరిగెత్తేవాడివి

   When you was young you could run well.

2. ఆమె స్కూలులో ఉన్నప్పుడు బాగా ఆటలు ఆడేది.

   She could play games well when she was at school.

*USAGE2*

'Could' కు ప్రక్కన not చేర్చితే వ్యతిరేకార్థక వాక్యాలు ఏర్పడతాయి.

ఉదా: వాళ్ళు బాగా ఆడినా మ్యాచ్ గెలవలేకపోయారు.

They could not win the match, even they played well.

*USAGE 3*

'Could' అనే పదాన్ని కర్మ (Subject) కుముందు ప్రయోగిస్తే మర్యాద పూర్వక (Polite Sentences) వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. దయచేసి మీరు నా కోసం ఆగగలరా?

   Could you please wait for me?

2. దయచేసి మీ పెన్ను ఇస్తారా?

   Could you please give me you pen.

ఈ విధంగా Could ను ఉపయోగించి మర్యాద పూర్వక వాక్యాలు తయారు చేయవచ్చు. ఇప్పుడు Can, Could స్వరూప స్వభావాలు మీకు పూర్తిగా అర్థం అయ్యాయి కదా! మరి మీరు ప్రయత్నించి కొన్ని వాక్యాలను Can, Could లను ఉపయోగిస్తూ వ్రాయండి. తరువాత Must గురించి తెలుసుకుందాము.

# MUST

Must అనే ఇంగ్లీషు మాటకు 'తప్పక' లేదా 'తప్పనిసరి' అనే అర్థాలు వున్నాయి. దీనిని వాక్యంలో ప్రయోగించేటప్పుడు దీని ప్రక్కన వుండే క్రియ రూపం ఎప్పుడూ Present Tense లోనే వుండాలి.

*USAGE 1*

Must ను Subject కు ముందు ఉపయోగించితే 'తప్పక' అనే అర్థంతో కూడిన వాక్యాలు రూపొందుతాయి.

**ఉదాహరణ**

1. ఇండియా గెలిచి తీరాలి.
   India must win the match.
2. నీవు తప్పక పరీక్ష రాసి తీరాలి.
   You must write the exam.

*USAGE 1*

Must కు తరువాత 'Not' అనే పదం వాడితే వ్యతిరేకార్థక వాక్యాలు (Negative Sentences) ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నువ్వు అతనితో మాట్లాడకూడదు.
   You must not talk with him.
2. సుధ నువ్వు ఢిల్లీ వెళ్ళకూడదు.
   Sudha you must not go to Delhi.

*USAGE 3*

'Must' ను Subject కు ముందు చేర్చి వుపయోగిస్తే ప్రశ్నార్థక Interrogative Sentences వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నేను పార్టీకి వెళ్లి తీరాలా?
   Must I go to the party?
2. నేను వారితో మాట్లాడి తీరాలా?
   Must I talk with them?

*USAGE 4*

'Must' కు ప్రక్కన be అనే పదం చేర్చితే 'అయి వుండాలి' అనే అర్థంతో కూడిన వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. ఆమె గొప్ప నటి అయి వుండాలి.
   She must be a great actress
2. అతను వాళ్ళ అబ్బాయి అయి వుండాలి.
   He must be his son.

*USAGE 4*

Must కు ప్రక్కన have అనే మాటను చేర్చితే 'అయ్యుండాలి' అనే అర్థంతో వాక్యాలు రూపొందుతాయి. అయితే ఇక్కడ క్రియ (verb) మూడవ రూపం అయిన Past Participle Tense లో వుండాలి.

**ఉదాహరణ**

1. నువ్వు తప్పక చేసి వుండాల్సింది.
   You must do that.
2. నేను పాఠం చదివి వుండాల్సింది.
   I must read that lesson

ఈ సూత్రాలను అనుసరించి ప్రతి దానికి మీకు ఇష్టం వచ్చినన్ని వాక్యాలు నిర్మాణం చెయ్యండి. ఆ తర్వాత ఇప్పుడు May గూర్చి తెలుసుకుందాం.

## MAY

May అను ఇంగ్లీషు మాటకు సాధ్యమగు లేదా 'వచ్చు' అనే అర్థం. దీనిని ఉపయోగించే వాక్యంలో క్రియ (Verb) ఎల్లప్పుడూ Present Tense లో మాత్రమే ఉండాలి.

*USAGE 1*

May అను పదాన్ని కర్త (Subject) కు తరువాత ఉపయోగించడం వల్ల 'అవవచ్చ', 'జరుగవచ్చు' అను అర్థం ఇవ్వగల వాక్యాలను రాయవచ్చును.

**ఉదాహరణ**

1. ఆమె పాడవచ్చును.
   She may be sing
2. ఇవాళ పరీక్ష ఫలితాలు రావచ్చును.
   Today the results may come

*USAGE 2*

May కు తరువాత అను మాట చేర్చటం వల్ల వ్యతిరేకార్థంవాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. దీప మీటింగుకి రాకపోవచ్చును.
   Deepa may not come to meeting
2. ఇండియా మ్యాచ్ గెలువకపోవచ్చును.
   India may not win the match

*USAGE 3*

May ప్రక్కన వాక్యంలో Be అను మాట చేర్చితే కావచ్చు అనే భవిష్యత్కాల వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నేను అక్కడికి రాకపోవచ్చును.
   I may not come there
2. ఆమె అతన్ని పెళ్ళి చేసుకోవచ్చును.
   She may be marry him

ఇప్పుడు మీకు ఒక ముఖ్య విషయం చెప్పాలి. 'Be' అనే మాటను పైన మూడు Model Auxillary Verbs లోనూ ఉపయోగించాం. అవి May, Must, Can అనేవి. వీటిలో Be ప్రయోగం జరిగినప్పుడు ఏర్పడిన అర్థ బేధాలను మీరు గుర్తించారా! గుర్తించగలిగితే మంచిదే ! గుర్తించలేకపోతే ఒక్కసారి మూడూ ఒక చోట చేర్చి చూపుతున్నాం బేధం గమనించండి.

1. సంఘవి ఇంటికి రాకపోవచ్చును (సందేహాత్మక భావం)
   Sanghavi may not come home.
2. ఆమె రవి స్నేహితురాలు అయి వుండవచ్చును. (ఖచ్చితమైన భావం)
   She must be Ravi's Friend
3. అతను ఆమెతో మాట్లాడవచ్చును. (సందేహాస్పద భావం)
   He can be talk with her

ఇక్కడ కొంచెం అటు ఇటుగా May/Can ల భావం ఒక్కటే !

సందర్భానుసారంగా ఏది అవసరమో, ఏది ఎక్కడ వాడాలో అక్కడ వినియోగిస్తే అందంగా వుంటుంది.

## MIGHT

ఇది May అను పదానికి భూతకాల (Past) స్వరూపం వుపయోగించే వాక్యంలోని క్రియ అంటే Verb-Present Tense లోనే ఉండాలి.

*USAGE 1*

Might అనేది సందేహాన్ని మరింత దృఢతరం చేసేదిగా వున్న వాక్యాలను రాయటానికి ఉపయోగిస్తారు.

**ఉదాహరణ**

1. స్నేహ మీటింగుకు రాకపోవచ్చును.

Sneha might not attend the meeting

2. రేపు అతను రావచ్చును.

Might he come tomorrow

*USAGE 1*

Might ను వాక్యంలో కర్త (Subject) కు ముందు చేర్చితే మర్యాద పూర్వక వాక్యాలు Polite sentences ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. అయ్యా ! నేను లోపలికి రావచ్చునా?

   : Might I come in sir !

2. మేము ఆ పనిని చేయవచ్చునా?

   Might we do that work?

ఇలా Might ను ఉపయోగించిన పలురకాల వాక్యాలు నిర్మాణం చేయవచ్చును.

May, Might లను వుపయోగిస్తూ అర్థవంతమైన, సందర్భోచితమైన వాక్యాలను వ్రాయండి. మరింతగా మీకు అవగాహన ఏర్పడుతుంది.

## NEED

Need అనే ఆంగ్ల పదానికి – 'అవసరం' అనేది తెలుగు మాట. దీనిని Model Auxillary Verb గా వాడతారు. ఇంగ్లీషులో ఇది నిజానికి ఒక Priniciple Verb అంటే ప్రాథమిక క్రియ.

*USAGE 1*

Need అనే మాటను వాక్యంలో కర్తకు (Subject) ప్రక్కన ఉపయోగిస్తే సాధారణ (Assertive Sentences) వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. సుధకు నా కారు అవసరం ఏర్పడుతుంది (అవసరం పడుతుంది)

   Sudha needs my car.

2. నాకు కాస్త డబ్బు కావాలి.

   I need some money.

*USAGE 2*

Need ను కర్త (Subject) కు ముందు చేర్చి వాక్య నిర్మాణం చేస్తే ప్రశార్థక (Interrogative Sentences) వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నాకు ఆ పని చెయ్యాల్సిన అవసరం ఉందా ?

   Need I do that work?

2. నేను అతనితో మాట్లాడవలసిన అవసరం ఉందా ?

   Need I talk with him ?

*USAGE 3*

Need కు ప్రక్కన 'Not' చేర్చి వాక్య నిర్మాణం చేస్తే వ్యతిరేకార్థక (Negative) వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. అతను ఇది చేయనవసరం లేదు.

   He need not do it.

2. సాయి అతని గురించి ఆలోచించవలసిన అవసరం లేదు.

   Sai need not think about him.

ఈ విధంగా Need తో మరిన్ని వాక్యాలు ప్రయత్నించండి. తరువాత మనం Model Auxillary Verb లో చివరి మూడింటి గురించీ తెలుసుకుందాం.

# OUGHT

Ought అనే ఇంగ్లీషు పదానికి 'వలసింది' అనేది స్థూలార్థం. కానీ దీనికి సంపూర్ణార్థం లేదు. దీని పక్కన సాధారణంగా 'To' అనే Proposition ను తప్పక చేర్చాలి. అలాగే ఈ వాక్యాలలో క్రియ (Verb) ఎప్పుడూ Present tense లో ఉండాలి.

*USAGE1*

Ought ను వాక్యంలో కర్త (Subject) ప్రక్కన ప్రయోగించితే నీతి, కర్తవ్యం (Model, Duty) వంటి సందర్భోచిత వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. మనం పెద్దలను ఎల్లప్పుడూ గౌరవించాలి.

   We aught to respect our elders always

2. మనము సత్యమును మాట్లాడాలి.

   We aught to speak truth.

   ఇలాంటి వాక్యాలకు మాత్రమే Aught ను ఉపయోగించాలి.

# DARE

Dare అంటే ధైర్యం అని కదా అర్థం. ఇది Auxillary Verb అయితే Principle verb ఎప్పుడూ Present Tense లోనే వుండాలి.

*USAGE 1*

Dare ను వాక్యంలో కర్త (Subject) కు ముందు వాడితే సాధారణ వాక్యాలు (Assertive Sentences) ఏర్పడతాయి.

**ఉదాహరణ**

అతను ధైర్యంగా ఆమెతో మాట్లాడగలదు.

He dare to talk with her.

*USAGE 2*

'Dare' ను వాక్యంలో కర్త (Subject) కు ముందు చేర్చితే ప్రశార్థక వాక్యాలు (Interrogative Sentences) ఏర్పడతాయి.

**ఉదాహరణ**

నీకు అతనితో పోటీ చేసే ధైర్యం ఉందా?

Dare you compete with him?

*USAGE 2*

'Dare' ప్రక్కన 'Not' చేర్చితే వ్యతిరేక (Negative) వాక్యాలు ఏర్పడతాయి.

**ఉదాహరణ**

1. నాకు అక్కడకు వెళ్ళే ధైర్యం లేదు.

   I dare not go there.

dare ను ఉపయోగిస్తూ సందర్భోచిత వాక్యాలను వీలయినన్ని ఎక్కువ తయారు చేయండి.

# USED

ఇది Model Auxillary Verb లో చివరిది - తొమ్మిదవది. దీనిని 'ఉపయోగపడే' అనే అర్థంతో ఉపయోగిస్తాం. ఇది నిజానికి ఒక సాధారణ క్రియ. (Principle Verb)

*USAGE 1*

Used ను వాక్యంలో కర్త (Subject) ప్రక్కన వాడితే సాధారణ Assertive Sentences వాక్యాలు ఏర్పడతాయి.

ఉదాహరణ

1. కాలిక్యులేటర్ లెక్కలు చేసుకోవడానికి ఉపయోగిస్తాము.
Calculator is used to do calculations.

*USAGE 1*

Used సాధారణంగా కొంతకాలం జరిగిన పనులు, నిత్య వ్యవహారంగా జరిగిన పనులను తెలియజేయటానికి వినియోగిస్తారు.

ఉదాహరణ

1. నేను క్రికెట్ ఆడుతూ ఉండేవాడిని.
   I used to play Cricket.
2. వారు అక్కడికి రోజూ వెళుతూ ఉండేవారు.
   They used to go there regularly.

మీకు Auxillary Verbs గురించి కూడా చెప్పడం పూర్తి అయింది. అంటే 24 రకాల Auxillary Verbs గురించి మీకు సంపూర్ణంగా విశదీకరించడం పూర్తి అయింది.

# అధ్యాయము - 5

## జాతీయములు

వాక్య నిర్మాణం చక్కగా వచ్చిన వారికి ఈ జాతీయములు గురించి తప్పక బాగా తెలిసి వుంటుంది.

కాలములు గురించి క్షుణ్ణంగా తెలిసిన వారికి వాక్య నిర్మాణం వచ్చినట్లే లెక్క ఇలాంటి వారికి జాతీయములు గురించి కూడా తెలిస్తే మరింత సులభంగా వాక్య నిర్మాణం చేపట్టవచ్చును. తెలుగు భాషలోని జాతీయములనే ఇంగ్లీషులో idioms & pharases అంటారు.

## IDIOMS & PHARASES

హావ భావాలను ప్రకటించే కొన్ని ప్రత్యేక పదాలనే జాతీయములు లేదా idioms అంటారు. అంటే మనం ఏదైనా సంఘటనను చూచినప్పుడు పొందే అనుభూతి బాగుందనో, అద్భుతంగా వుందనో, బావుండ లేదనో, ఏదో ఒక దానిని బహిర్గతపరుస్తాం కదా ! ఆ భావ ప్రకటలనకు వినియోగించే పదాలనే idioms అంటారు.

అలాంటి కొన్ని ఆంగ్ల idioms & phrases గురించి ఇప్పుడు తెలుసుకుందాం. ఉదాహరణలను కూడా పరిశీలించండి. ఏఏ సందర్భాల్లో ఎలాంటి idioms &phrases ఉపయోగించవచ్చో మరింత బాగా అర్థం అవుతుంది.

1. All of a sudden అకస్మాతుగా
   EX: All of a sudden the cyclon had come.
2. At once వెంటనే
   EX: At once Gujarat destroyed in the earthquake.
3. At any rate ఏ విధంగానైనా
   Ex: At any rate I want to meet him.
4. According to దాని ప్రకారం
   Ex: Teachers are moved according to the instructions of the principle.
5. Because of ఆ కారణముగా
   Ex: Because of Sachin batting India won.
6. By way of మాట వరుసకి
   Ex: I told that story by way of example.
7. For a Whileకొంచెం సేపు
   Ex: He looked at me for a while.
8. For want of లేకపోవుట వలన
   Ex: For want of money he canceled his programme.
9. For the sake of ఇతరుల కోసం, పరుల కోసం
   Ex: He kept every thing for the sake of his children.
10. For the purpose of ఒక ఆశయం కోసం
    Ex: We met C.M for the purpose of Mahila Sanghas
11. Infact నిజానికి
    Ex: Infact people angry against the Government.
12. In course of time కొంతకాలానికి
    Ex: In course of time every will be setright.
13. On Behalf తరుపున
    Ex: Ramu attends the meeting on behalf of his company.
14. Infront Of ఎదురుగా
    Ex: There is zimbkhana groung in front of our office.
15. Instead of బదులుగా
    Ex: My mother cooked chapathi insted of rice.

16. In returns ప్రతిఫలముగా
    Ex: I got an award in return of my talent.
17. Look after జాగ్రత్తగా చూసుకొనుట
    Ex: Mother looked After their Childers.
18. Put of death చంపివేయుట
    Ex: Many soldiers put to death in Kargle war.
19. Take no notice గమనించకపోవుట
    Ex: Students took no notice to the Principle, so they are punished.
20. Depend On ఆధారపడి ఉండు
    Ex: Indian team depends on Sachin.
21. Belong to చెందియుండు
    Ex: We belong to
22. Look for వెదకుట
    Ex: Sneha was looking for good match for her son.
23. Gave up వదిలివేయు
    Ex: Rajeshekar reddy gave up all his hopes in elections.
24. In order to ఒకదానికొరకు
    Police Fired on the crowed to protect law&Order.
25. In the nick of time చివరి క్షణంలో
    Ex: In the nick of time my mother gave me money.
26. Little by little మెల్లమెల్లగా
    Ex: Little my littletheif entered the room.
27. On the whole మొత్తం మీద
    Ex: On the whole India own.
28. On Account of ఆ కారణం చేత
    Ex: On the Account of their hard work they passed.
29. Then and there అప్పటికప్పుడే
    Ex: He settled the matter then and there.
30. Without Fail. తప్పకుండా
    Ex: Please attend the exam with out fail.
31. In the hope of నమ్మకంతో
    Ex: In the hope of bright future, he is bearing pains.
32. In Favour Of అనుకూలంగా
    Ex: America speak in favour of India.

33. Turned out of వెళ్ళగొట్టుట
    Ex: Britishers turned out of the India.
34. All sort of అన్ని రకాలు
    He can buy all sort of thing here
35. On the way to దారిలో
    Ex: I met Ravi on the way to my house.
36. In the middle of మధ్యలో
    Ex: There is a big contraversy in the middle of Pakistan & India
37. Grow weary of విసుగుచెందు
    Ex: Indian grew weary of Pakistan activities.
38. Femiliar with బాగా తెలిసిన
    Ex: Nehru is familier with the name 'Chachaji'
39. Red handed నేరం చేస్తుండగా దొరికిపోవుట
    Ex: She was caught red handed while doing smugling.
40. Good Books Of విశ్వాసానికి తగిన
    Ex: Anjaneya is good books of Rama.
41. As long as అంతవరకూ
    Ex: As long as she is talking we are listening.
42. Along with కూడా
    Ex: Team followed along with sachin.
43. Away from దూరంగా
    Ex: We should far away from bad persons.
44. Upset తారుమారగు, దిగ్భ్రాంతిచెందు
    Ex: The Entire country was upset by the murder of Rajiv Gandhi.
45. Make-sure జాగ్రత్తపడుట
    Ex: Before you atend the meeting make sure that meeting is in time.
46. Make Up సరిచేసుకొను
    Ex: He make up in practice.
47. On the other hand
    She never thānked him, on the other hand she scolded him.
48. Add fuel to the fire అగ్నికి ఆజ్యం పోయు
    Ex: Always Pakistan added fuel to the fire of terrorism.
49. Castle In the air గాలిలో మేడలు కట్టు
    Ex: By castling in the air Sneha lost her life.

50. To keep all of దూరంగా వుంచడం
 Ex: To keep all of from bad thoughts.
51. Heart and Soul త్రికరణ శుద్ధిగా
 Ex: Indian army fighting with Heart and soul for peace with Pakistan.
52. Open secret బహిరంగ రహస్యం
 Ex: It Is open secret that Pakistan is sending terrorists to the Indian boarders.
53. To go home to ప్రభావం చూపు
 Ex: The Violent bad behaviour went home on her life.
54. To give quarter కరుణ చూపు
 Ex: Always to give quarter to on the poor people.
55. To run down అలసిపోవు
 Ex: Sneha rundown by speed walk.
56. To rub through పోటాపోటీగా
 Ex: Don't run through electricity, It is very bad.
57. A dead letter నిరుపయోగమైన
 Ex: All his hopes are now dead letters.
58. A galaday పండుగ రోజు
 Ex : Holy is a galady for every Indian.
59. A nine day's wonder మూడునాళ్ళ ముచ్చట.
 Ex: The marriage Sneha is a nineday wonder.
60. A walk over సులభమైన విజయం
 Ex: India had a walk over against Pakistan in cricket.
61. An Iron hand నిర్దాక్షిణ్యముగా
 Ex: America put down the enemies with an iron hand.
62. At a loss దిక్కుతోచని స్థితిలో
 Ex: India and Pakistan were at a loss of where to go.
63. Of no avail ప్రయోజనం లేని
 Ex: Srinath bowls is a beautiful but of no avail.
64. Once for all చిట్టచివరకు
 Ex: Siva married sindhu one for all.
65. Neck to neck పోటాపోటీగా
 Ex: There is a neck to neck competition in exam between Ravi& Sudha.
66. To gain ground అభివృద్ధి చెందు.
 Ex: Computer is gaining ground in India now a days.

67. Null and void చెల్లని
    Ex: 20 paise is a null and avoid coin today.
68. To strike off తొలగించు
    Ex: Pakistan president struck off from the country.
69. To take of the hat to గౌరవించు
    Ex: Students take of their hats to their teachers.
70. To take a Fancy to ఇష్టపడు
    Ex: Ravi has taken a fancy to marry Sudha.
71. To play in to hands కీలుబొమ్మవలె ప్రవర్తించు
    Ex: The Pakistan plays into hands of America.
72. To beat Black and Blue చావచితక్కొట్టు.
    Ex: The Indians army beat the pakistan military Black and Blue.
73. To be in vouge ఫ్యాషన్
    Ex: Lasbianism is in vouge in western countries now a days.
74. Capital punishment మరణ శిక్ష
    Ex: Many people in freedom fight liking the capital punishment.
75. Dead of Night అర్థ రాత్రి
    Ex: We got Indipendence on August 15 th date of night.
76. Crocodile Tears మొసలి కన్నీరు.
    Ex: Some people shed crocodile Tears at the Draught effected people.

**GO - WENT - GONE - GOING వెళ్లు**

**SIMPLE PRESENT (PRESENT INDEFINITE) సింపుల్ ప్రెజెంట్**

1. I go - నేను వెడతాను
2. We go - మేము వెడతాము
3. You go - నీవు వెళ్ళెదవు
4. He goes - అతను వెళ్ళును
5. She Goes - ఆమె వెళ్ళును
6. They goes - వారు వెడతారు.
7. Who goes ? - ఎవరు వెళతారు?

**SIMPLE PAST సింపుల్ పాస్ట్**

1. I went - నేను వెళ్ళాను.
2. We went - మేము వెళ్ళాము

3. you went - నువ్వు వెళ్ళావు
4. He went - అతను వెళ్ళాడు
5. She went - ఆమె వెళ్ళింది
6. They went - వారు వెళ్ళారు
7. Who they went - ఎవరు అక్కడికి వెళ్ళింది?

**PRESENT CONTINUOUS ప్రెజెంట్ కంటిన్యూస్**

1. I am going - నేను వెళ్తున్నాను.
2. We are going - మీరు వెళుతున్నారు
3. You are going - నీవు వెళుతున్నావు.
4. He is going - అతను వెళుతున్నాడు
5. She is going - ఆమె వెళుతున్నది
6. They are going - వారు వెళుతున్నారు
7. Who are going ? - ఎవరు వెళుతున్నారు?

**PAST CONTINUOUS పాస్ట్ కంటిన్యూస్**

1. I was going - నేను వెళుతుంటిని
2. We were going - మీరు వెళుతుంటిరి
3. You were going - నీవు వెళుతుంటివి
4. He was going - అతను వెళుతుండెను.
5. She was going - ఆమె వెళుతుండెను.
6. They were going - వారు వెళుతుండిరి
7. Who were going? - ఎవరు వెళుతుండిరి.

**PRESENT PERFECT ప్రెజెంట్ పెర్ఫెక్ట్**

1. I have gone - నేను వెళ్ళి ఉన్నాను
2. We have gone - మేము వెళ్ళి ఉన్నాము
3. You have gone - నీవు వెళ్ళి ఉంటావు
4. He has gone - అతను వెళ్ళి ఉన్నాడు
5. She has gone - ఆమె వెళ్ళి ఉన్నది
6. They have gone - వారు వెళ్ళి ఉన్నారు
7. Who have gone? - ఎవరు వెళ్ళి ఉన్నారు?

PERFECT CONTINUOUS పర్ఫెక్ట్ కంటిన్యువస్

1. I have been gone - నేను వెళ్తూ ఉన్నాను.
2. We have been gone - మేము వెళ్తూ ఉన్నాము.
3. You have been gone - నీవు వెళ్తూ ఉంటావు.

4. He has been gone - అతను వెళ్తూ ఉన్నాడు.
5. She has been gone - ఆమె వెళ్తూ ఉన్నది
6. They have been gone - వారు వెళ్తూ ఉన్నారు.
7. Who have been gone - ఎవరు వెళ్తూ ఉన్నారు?

**PAST PERFECT పాస్ట్ పెర్‌ఫెక్ట్**

1. I had gone - నేను వెళ్ళి ఉంటిని
2. We had gone - మేము వెళ్ళి ఉంటిమి
3. You had gone - నీవు వెళ్ళి ఉంటివి
4. he had gone - అతను వెళ్ళి ఉండెను
5. She had gone - ఆమె వెళ్ళి ఉండెను
6. They had gone - వారు వెళ్ళి వుంటిరి
7. Who had gone? - ఎవరు వెళ్ళి వుంటిరి?

**PAST PERFECT CONTINUOUS పాస్ట్ పెర్‌ఫెక్ట్ కంటిన్యూస్**

1. I had been gone - నేను వెళ్తూ ఉంటిని
2. We had been gone - మేము వెళ్తూ ఉంటిమి
3. You had been gone - నీవు వెళ్తూ ఉంటివి
4. He had been gone - అతను వెళ్తూ ఉండెను
5. She had been gone - ఆమె వెళ్తూ ఉండెను.
6. They had been gone - వారు వెళ్తూ వుండిరి
7. Who had been gone? - ఎవరు వెళ్తూ వుండిరి?

**SIMPLE FUTURE సింపుల్ ఫ్యూచర్**

1. I shall go - నేను వెళ్తాను
2. We shall go - మేము వెళ్తాము.
3. You shall go - నీవు వెళ్తావు
4. He will go - అతను వెళ్తాడు
5. She will go - ఆమె వెళ్తుంది.
6. They will go - వారు వెళ్తారు?
7. Who will go? - ఎవరు వెళ్తారు?

**FUTURE CONTINUOUS ఫ్యూచర్ కంటిన్యూస్**

1. I Shall be going - నేను వెళ్తూ ఉంటాను.
2. We shall be going - మేము వెళ్తూ ఉంటాము
3. You will be going - నీవు వెళ్తూ ఉంటావు
4. He will be going - అతను వెళ్తూ ఉంటాడు.

